ఓమ్ తత్ సత్

సత్యమేవ జయతే

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణేనమః

# బ్రాహ్మణులెవరు?

గ్రంథకర్త

మతోద్ధారక జిల్లెళ్ల వీరబ్రహ్మాచార్యులు.

దివ్వూరు. :—: కడప జిల్లా




ప్రకటించినవారు

విశ్వకర్మ సాహిత్య ప్రచార మండలి

మంగళాపురపు బాబురావు

సంతబజారు, చీరాల-523 155

ప్రకాశం జిల్లా.

 వెల : రు 20/-

ఉపకరణ్ల వెంకటాచార్యులు గారికి

ఓమ్ తత్ సత్

సత్యమేవ జయతే

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణేనమః

26/11/09

By POST.

# బ్రాహ్మణులెవరు?

320

గ్రంథకర్త


మతోద్ధారక జిల్లెళ్ల వీరబ్రహ్మాచార్యులు.

దివ్వూరు, :—: కడప జిల్లా



ప్రకటించినవారు

విశ్వకర్మ సాహిత్య ప్రచార మండలి

మంగళాపురపు బాబురావు

సంతబజారు, చీరాల-523 155

ప్రకాశం జిల్లా.




వెల : రు. 20/-

# విన్నపము

మహాశయులారా! మతత్రయాంతర్గతులగు మనభారతీయులకు వేదములు బరమప్రమాణములుగదా! తదనుసరణములగు స్మృతులు, శాస్త్రములు బ్రమాణీకృతములే యగుచున్నవి. వీటి నన్నింటియందును విరాడ్విశ్వకర్మ పరమేశ్వరుడే జగన్నిర్మాణ కర్తయనియు, సృష్టికర్తయనియు చెప్పబడినది. అనంతనామములచే బిలువబడు యాబరమేశ్వరులకు విశ్వకర్మ నామము ప్రధానమును సార్థకము యైయున్నది. విశ్వకర్మ శబ్దమును గురించి పురుష సూక్తమునందు ఈ విధముగా చెప్పబడియున్నది... ... .........విశ్వకర్మణఃజగత్కర్తుః......... 'త్వష్టావిశ్వకర్మాజగధీశ్వరః' అని విద్యారణ్యభాష్యమునందు చెప్పబడియున్నది. రామానుజాచార్యులు వ్రాశిన భాష్యమునందుగూడ...... 'దేవతిర్యఙ్మనుష్యాదిస్థావరాది సర్వప్రపంచశ్చసంభూతః సః ద్వివిధః- ప్రపంచః విశ్వకర్మణః- అధిసమవర్తతః- విశ్వంప్రపంచం కర్మయస్యసః విశ్వకర్మాపురుషోత్తమః" అనియు-మహీ-భాష్యమునందు ........విశ్వంసర్వంక్రియ మాణమస్యస విశ్వకర్మాతస్య పరమేశ్వరస్య యనియు వాకొనబడియున్నది. అంతేకాదు యజుర్వేదము కాంఖ ప్రఖ అఖలోఖ విశ్వకర్మాది శాంపతిస్పనః పశూన్పాతుసో స్మాన్పాతు తస్మైనమః" అనియు ఋగ్వేదాష్టమాష్టక తృతీయాధ్యాంతమునను, కృష్ణయజుర్వేదతైత్తరీయ సంహిత యందు జతుర్థకాండషష్ఠ ప్రపాఠకద్వితీయాను వాకమునందారు మంత్రములను, శుక్లయజుర్వేదము నందలి విశ్వకర్మ సూక్తమునందు ఆ విశ్వకర్మపరమేశ్వరుని యనేకవిధముల స్తుతింపబడియున్నది. అట్టి వేదస్వరూపుడగు విశ్వకర్మ పరమేశ్వరుని సంతానము విశ్వకర్మ విశ్వబ్రాహ్మణ శిల్పిబ్రాహ్మణ

రధకారబ్రాహ్మణ, దేవబ్రాహ్మణసపతి ఆచార్యాదిదశవిధ బ్రాహ్మణులుగా పిలువబడువారి ఆధిక్యతశ్రుతి స్మృతిపురాణేతి హాసములయందు నెంతగానో వాకొనబడియున్నది. కాని కొంత కాలమునుండి ఆవేదస్వరూపుని ప్రధాననామమునకు తత్సంత తీయులగు విశ్వకర్మల ఆధిక్యతకు యేలనో కొంతకుంటు వాటిల్లి నది. "నీహారేణప్రావృదా జల్ప్యాచ" అను సూక్తి మంచుచే గప్ప బడినట్లున్నదనుట జ్ఞప్తికి దెచ్చుచున్నది.

సృష్టికర్తయొక్క నామము తద్వంశీయులగు విశ్వబ్రాహ్మణులు ప్రశస్తియు కొంతమరుగున బడుటయు తలనరికించు కొన బడిన దేవతల యొక్కయు, స్త్రీలచే శాపదగ్ధులైన దేవతల యొక్కయు తదనుయాయుల యొక్కయు పేర్లు ప్రసిద్ధి వహిం చుటయు తటస్థించినది. ఇది విచిత్ర మనక తప్పలేదు. ఇది యంతయు విశ్వకర్మయొక్కయు, విశ్వబ్రాహ్మణుల యొక్కయు, యౌన్నత్యము జూడజాలక కుతంత్రులు జేసినపన్నాగమేనని ఋజువైనది. జగన్నిర్మాణకర్తయగు యావిశ్వకర్మ సంతానము నందలి వారే పండితులమనుకొందరు దురభిమానులు మేము శైవులమనియు, అట్టి శైవులు విష్ణువు ముఖముచూచిన మహా పాప మనియు, మరి కొందరు మేము వైష్ణవులమనియు ఈశ్వరుని ముఖ ముచూచిన మహాపాపమనియు, పులి తరుముకొనివచ్చునపుడు ప్రాణభీతితోనైనను శివాలయములో ప్రవేశించ కూడదనియు, మరికొందరు స్మార్తులమనియు, బ్రహ్మసంతతి వారమగుటచే బ్రాహ్మణులమనియు, బ్రహ్మదేవుడు తలనరికించుకొనబడిన కారణముగా బ్రహ్మకు పూజచేయకూడదనియు, విష్ణువువలన బ్రహ్మ యీశ్వరుడు పుట్టినారనియు. యీశ్వరునివలన విష్ణువు బ్రహ్మ పుట్టినారనియు, బ్రహ్మదేవుని వలననే విష్ణు యీశ్వరులు పుట్టి

నారనియు, బ్రహ్మకు ముఖము యందు బుట్టినవారే బ్రాహ్మణు లనియు, తక్కిన వారందరు భుజోరు పాదములయందు క్షత్రియ వైశ్యశూద్రులు పుట్టినారనియు, మరికొందరిని ఛాండాలురనియు, కల్లిబొల్లి కథలన్నిటిని అల్లి పెట్టిరి. యీ కుతంత్రదావాగ్నిని చల్లార్చి యదార్థమును ప్రకాశింపజేయుటకే భారతదేశమంతటను విశ్వబ్రాహ్మణులందరు యుద్యమము లేవజేసిరి ఇట్టి ప్రయత్న మునందు కూడ మేమే అగ్రజాతివారమనియు, అందరికన్నను మేమే అధికులమనియు వాదించు జాత్యహంకారులు ఎన్నియో ఆటంకములు అపచారములు గావింప మొదలిడిరి, జాత్యహంకారు లగు నావిప్రసంఘము సోదరసంఘీయులగు నావిశ్వబ్రాహ్మణుల ఔన్నత్యము చూడజాలక పన్నిన పన్నాగము లన్నింటిని సాంఘి కముగను, రాజకీయముగను నెదుర్కొనిరి. విశ్వబ్రాహ్మణులు శూద్రసమానులనియు, నీచులనియు, తయారు చేసికొన్న శాస్త్ర పురాణదుల నాధారముగ దీసికొని విశ్వబ్రాహ్మణుల నీచపరుప నుద్దేశ్యముతో కోర్టుల కెక్కిరిగాని, ఆట్టి కోర్టులందు సృష్ట్యాదిన పరమేశ్వరునిచే ప్రవచింపబడిన శృతిస్మృతులవలన ప్రతివాదుల వాదనలనన్నిటిని ఖండ ఖండములొనరించి విశ్వబ్రాహ్మణులు తమ విజయ పతాకముల నెగురవేసిరి.

స్వార్థపరులు గావించిన కృత్రిమ తంత్రములవలన వారి ఆధిక్యత కొరకు అక్కడక్కడ ఇంకను ప్రయత్నములు చేయు చునే యున్నారు. విద్యారాహిత్యులును, శాస్త్రపరిచయములేని వారును అచ్చటచ్చట ఇంకను వారిని ననుసరించుచునే ఉన్నారు. ఆ కారణముగానే విశ్వబ్రాహ్మణ సంఘము వారుకూడ తమ ఆధి క్యత రుజువు పరచుటకు సంఘములద్వారా, సమాజములద్వారా, గ్రంథప్రచురణములద్వారా, పత్రికా ప్రచారముల ద్వారాను ఇప్పటి వరకును పాటుబడుచునే యున్నారు.

నేడు కాలము మారినది జాతి బేధములడుగంటినవి. జాతి పితయగు గాంధీమహాత్ముని ఉద్యమ ఫలితముగా అంటరానితనము దేశమునందే యుండగూడదనియు మానవులలో నొక రెక్కువ మరొకరు తక్కువ యను భావమే ప్రజలనుండి దూరము చేయవలయుననియు,చేసిన యుద్యమ ఫలితముగా మన రాజ్యాంగ నేతలుకూడ అట్టి దానికే ప్రాధాన్యత నిచ్చి శాసనములు కూడ గావించి ప్రజాపాలనము గావించునట్టి యీ జాతీయ ప్రభుత్వము నందును స్వార్థపరులుగావించు ఎక్కువతక్కువలను చిలిపి జేష్టల ఖండించుటకే నాయీ గ్రంథరచనకారణమైనది.

నేను, నాజాతియే అందరికంటే అధికమైనదనియు, ఇతర జాతులన్నియు తక్కువ యని చూపెట్టుటకుగా నేనీగ్రంథము వ్రాయలేదు. అట్టి యుద్దేశ్యముకూడ నాకులేదు యెవరైనను అట్లు తలంచిన వారి అజ్ఞానమే కాని దానికి నేను బాధ్యుడనుకాను. అందరికంటె మేమె అధికులమనియు మేమే బ్రాహ్మణుల మనియు అగ్రజాతివారమనియుఇతరులకెవ్వరికిబ్రాహ్మణ నామాధి కారములేదనియు వాదించుతూ సర్వజనుల సమానముగ జూచు చుండు జాతీయ ప్రభుత్వ పాలనమునందుకూడ వారుచేయుచు ండు మొండివాదమును, యీ వాదమునందలి యదార్థస్వరూపమును, వారి అధిక్యతలోని సారాంశము సర్వజనులకు తెలియజేయు టకును, బ్రాహ్మణులనగా నెవరు? అట్టివారు బ్రాహ్మణులు. వారి గౌరవమైన వృత్తులేవి? అను విషయము పాఠకుల వారంతకువారే నిర్ణయించుకొనుటకుగా యీ గ్రంథము వ్రాసినాడనేకాని ఇతరుల చిన్నబుచ్చుట, నీచపరచుట, నా అభిమతము గాదు. ఈ యిరువ దవ శతాబ్దమునందు కూడ వేద వేదాంగముల యందలి విషయ ములు దెలిసికొనక లోక వ్యవహారముల గుర్తించక ఏమారు

మూలలలోనో, ఏ పల్లెటూళ్లలోనో, కూర్చొని మేమే అగ్రజాతి వారమనియు, మేమే బ్రాహ్మణజాతి వారమనియు, బ్రాహ్మణజాతి నామధారు లింకెవ్వరు లేరనియు చేయుచుండు మొండివాదములలోని యదార్థమును సర్వులకు తెలియునట్లు యీ గ్రంథము సలహాచెప్ప గలదనియే నా యుద్దేశ్యము.

నేను విశ్వబ్రాహ్మణ సంఘము తరుపున 1941 వ సంవత్సరం అక్టోబర్ నెల ప్రారంభమునుండి ప్రభుత్వానుమతితో "అరుణోదయ" యను మాసపత్రికను నడుపుచుంటిని. ఆపత్రికకు రాయచోటి తాలూకా రాయవరమను గ్రామములోనున్న ప్రొద్దుటూరు సోమయ్యాచార్యులు అను వారు కూడ నొకచందాదారుగాయుండిరి. ఆ గ్రామములో చాలాకాలమునుండి సదరు సోమయ్యాచార్యుల కుటుంబమునకు ఆచారముగా జరుగుచుండిన మామూలు మర్యాదను 1956 సంవత్సరమున ఆగ్రామమునందలి విప్రులు సదరు సోమయ్యాచారిగారితో మేము బ్రాహ్మణులము మాతోపాటు మర్యాద మీకు జరుపుటకు మేము సమ్మతించుట లేదని మామూలు జరుపు గ్రామపెద్దలలోని కొందరిని లోబరచుకొని మామూలు మర్యాదను ఆక్షేపించిరి. అనాది కాలమునుండియు జరుగుచుండిన మామూలు మర్యాదను యెందుకు ఆక్షేపించిరో విశ్వబ్రాహ్మణుల బ్రాహ్మణత్వమును యీనాడు ఏల శంకించిరో ఆవిషయము తెలిసికొనుటకుగా "బ్రాహ్మణులెవరు?" అను మకుటముతో అరుణోదయ పత్రికయందు 1956 సం॥రం ఆగస్టు సంచిక నుండి 1957 సం॥ జూలై సంచిక వరకు క్రమముగా నీ గ్రంథవిషయము ప్రచురించితిని. యీ ప్రకటన పత్రికలన్నియు సోమయ్యాచారి తమ్ముడు నరసింహాచారి ద్వారా ఆక్షేపణదారులకు చూపించబడుతునె యుండెను. కాని ఆక్షేపణదారులగు విప్రులు యిందులకు తమ ఆక్షేపణగాని సమాధానముకాని చెప్పలేదు.

తర్వాత "అరుణోదయ" చందాదారులలోని విశ్వబ్రాహ్మణులు యీవిషయము నంతటిని వక గ్రంథరూపమున ముద్రించుట అత్యావసరమని కోరినందున వారి కోర్కెననుసరించి యీ గ్రంథమును కొన్ని చేర్పులు, మార్పులతో ముద్రింప బూనుకొంటిని ఈ గ్రంథమునందు అనేక గ్రంథములలోని విషయములు విశ్వబ్రాహ్మణులకు విప్రులకు బ్రాహ్మణత్వమును గురించి జరిగిన కోర్టు వ్యవహారముల గురించియు, జనులు వాగ్రూపమున జెప్పికొను విషయముల గురించియు, కొన్ని గ్రంథములు గెజటులు మున్నగు వానిలోని విషయములు ఉదాహరణలు జూపుచూ "బ్రాహ్మణులెవరు? బ్రాహ్మణుని వృత్తిఏమి? బ్రాహ్మణత్వము కలుగునది జన్మచేతనా? లేక కర్మచేతనా? లేక రెంటిచేతనా?" యను విషయములు పాఠకులే నిర్ణయించుకొమ్మని మనవిజేసియున్నాను. ఇందు విశ్వబ్రాహ్మణుల బ్రాహ్మణత్వమును గురించి శకించువారికి సలహాగా నీ గ్రంథమును ప్రచురించినానే కాని ఇతర జాతివారల నిందించుటకుగాని న్యూనత పరచుటకుగాని నేనీ గ్రంథమును ప్రచురించలేదు సోదర సంఘములలో మరొక సంఘము వారిని నిందించవలయు ననెడిది మా ఉద్దేశ్యముకూడ కాదు. మా అభిమతముకూడ కాదని మరొకమారు విజ్ఞప్తి చేయుచున్నాడను.

ఈ గ్రంథమునందు ఇతర జాతి వారల పరువుకు భంగము కలిగించునని గాని కించపరచునట్టి విషయములుగాని యున్నవని భావించువారు అట్టి వ్యతిరేకములగు విషయములుండిన మాకు దెలిపినచో రెండవ ముద్రణయందు సవరింపబడునని కూడ మనవి చేయుచున్నాడను        సత్యమేవ జయతే.

దువ్వూరు
ప్లవ గ్రీష్మర్తు
1—8—1961

మతోద్ధారక
జే. వీరబ్రహ్మాచార్యులు
గ్రంథకర్త

# బ్రాహ్మణులెవరు ?

సోదరులారా! మత, ప్రాంతీయ, వర్ణ, కులాభిమానము లకు చోటివ్వక పక్షపాత రహితులై న్యాయదృష్టితో గ్రంథము పరిశీలించి యదార్థమును గుర్తించగలరని ముందుగా విజ్ఞప్తి చేయుచున్నాడను.

మనదేశమునందు వేదకాలమున వృత్తికి ప్రాధాన్యత నిచ్చియుండుటచే ఆనాడు శిల్ప వృత్తికి అగ్రస్థానము నిచ్చిన వారైనందున అవృత్తి నాచరించు విశ్వకర్మలుకూడ అగ్రస్థానము నందియుండి ప్రజలలో పూజ్యులుగా నుండిరి "శిల్పమధ్యయనం నామవృత్తం బ్రాహ్మణ లక్షణ"మ్మని కూడా వేదాది గ్రంథములయందు కనబడుచున్నది. అందుచే శిల్పకర్మ నాచరించు విశ్వకర్మలు బ్రాహ్మణ జాతివారుగా రూపొంది యుండిరి. అటు తరువాత పౌరాణిక యుగమున కాయ కష్టోల్లంఘనులగు బ్రాహ్మణ నామధారులు తమ యొక్కరి ఆధిక్యత కొఱకై కొన్నికట్టు కథలు అల్లిబిల్లిగనల్లి అందు వర్ణాశ్రమ ధర్మముల పేరిట అనేక గ్రంథములు వ్రాసి అందులో జాతులు, కులములను పేరున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, ఛాండాలురను నైదు వర్ణములుగా రూపొందించి అందులో బ్రాహ్మణుడనువాడు అందరికంటె అధికుడనియు. తరువాత వారు ఒకరి కంటె నొకరు తక్కువ వారుగాను ఛాండాలురు అందరికంటె హీనజాతి వారనియు నిర్ణయమేర్పరచి విద్యా సంస్కారాదులు లేని ప్రభువులవద్ద స్థానముల సంపాదించి అనేక మాయోపాయములచేత తమ జాతికి ఆధిక్యత సంపాదించిరి.

అటు కొంత కాలము జరిగిన తరువాత రాజరిక పాళెగాండ్ర ప్రభుత్వమునందు కూడ అనేక మారోపాయములు గల్పించి, వేద యుగమునుండియు ప్రజా జీవితములకు మిగుల అవసరములైన శిల్పముల యందును, తత్కర్మ నాచరించు శిల్పి దామ్మల యందును ప్రత్యేక ఈర్ష్య వహించి విశ్వకర్మ వంశీయులగు శిల్పి బ్రాహ్మణులపై పాళెగాండ్ర మునికొలువ వారిచర్యలకు వీరు లొంగనందున వీరిపై కొన్ని అంక్షలు రూపొందించుట ద్వారా విశ్వకర్మ బ్రాహ్మణుల అధికృతను రూపు మాపుటయే గాక నీచత్వము కూడ వారియందారోపింపజేసి వారి సాంప్రదాయములగు వేదకర్మలకు గూడ ఆటంకములు కలిగించి, వేదకర్మల స్వేచ్ఛగా నాచరించు కొనుటకు అనేక అంతరాయములు కలిగించిరి

విద్యాగంధ మెఱుంగని పాళెగాండ్రగు పాలకుల వల్లను, న్యాయమార్గ మెఱుంగని బ్రాహ్మణ ప్రభువులవల్లను, విశ్వ బ్రాహ్మణుల కనేక ఇక్కట్టులు కలిగినందున వారికీర్తి ప్రతిష్ఠలు శిల్ప కర్మల యాధికృతయు, కొంత మఱుగున బడక తప్పక పోయెను. ఇట్లు కొంత కాలము గడచెను. అనేక చిక్కులచేతను, ఒడిదుడుకులచేతను, విశ్వబ్రాహ్మణులు చాలకష్టముల ననుభవించుటయే గాక క్రీస్తుశకము 1506 వ సంవత్సరమున నుండి రాయన భాస్కరుడు (మంత్రి భాస్కరుడు) ఎఱ్ఱంశెట్టి మేరా పాత్రుడు, మైగాలపు బెజ్జసిడు, కనకాల నల్లా పాత్రుడు మొదలగు మహనాటివారు పన్నిన కుటిల తంత్ర పన్నాగము వలనను, దుష్ట శాసనముల మూలమునను మట్టిలో పూడిన మణికాంతివలె విశ్వ బ్రాహ్మణుల కీర్తి ప్రఖ్యాతులతోపాటు తమ తేజః కాంతులు కూడ మఱుగుపడి వుండవలసివదే గాక సామాన్య సామాజిక

ధర్మములుకూడ నడపుకొనుటకు వీలులేక యుండెను. విశ్వ బ్రాహ్మణు లిట్లు దుర్మార్గుల పాలన వలనను; కాయన కష్టోల్లం ఘనులగు పాపరిల వలనను, అల్లిబిల్లిగనల్లిన పురాణాది గ్రంథ ముల వలనను, తదనుచరుల వలనను, బోనులలో చిక్కుకున్న సింహములవలె తమనిజ స్వరూపముల ప్రకాశ పఱచుటకు తగు కాలము కొఱకై నిరీక్షించుచుండిరి.

లభించిన దానితో తృప్తిజెందక పేరాశచే కుతంత్రములుచేయు అనేక దుష్కార్యములచే మన భారతదేశము ఇతర దేశీయుల పాలగుటకు కారణ మయ్యెను. 1328 సం॥న మహమ్మద్ తుగ్లక్ ఓరుగల్లు ముట్టడిచేసిన కాలమునుండి మనదేశము నందలి రాజ కీయము లన్నియు తారుమారు కాజొచ్చెను. తదాదిగ అనేక విప్లవ కార్యములు జరిగి తుదకు 1766 లో మన ఆంధ్రదేశము నందలి గంజాము, విశాఖపట్టణము, గోదావరి జిల్లాలు నైజాము నుండి బ్రిటీషువారి స్వాధీనమయ్యెను. 1768 లో కృష్ణ జిల్లా 1769 లో రాజమహేంద్రవరము 1788 లో గుంటూరు 1811 లో కడప, బళ్లారి, అనంతపురం, కర్నూలు, నెల్లూరు ఇవన్నియు బ్రిటీషువారు స్వాధీన పరచుకొనిరి.

అప్పటి నుండియు అజ్ఞాతవాసము నందుండిన పాండవుల వలె విశ్వబ్రాహ్మణులు తమ సాంప్రదాయపు హక్కుల పునః స్థాపిత మొనర్చుకొనుటకునై అనేక ప్రయత్నములు సాగించు చుండ అప్పటికిని మహనాటి సమ్మె కాలమున దేశ ద్రోహులగు పండితులును, పాళెగాండ్రును ఏర్పఱచిన దుష్ట శాసనములకు తోడు అనుభవ హక్కులను పేరున అమాయకులగు కొందరు అడ్డుపడు చుండిరి.

మొదటి సారిగ ఆంధ్ర దేశమునందు చిత్తూరు జిల్లా యందు శదుర్వేరిలోని విప్రులకును విశ్వబ్రాహ్మణులకును బ్రాహ్మణత్వమును గురించియు పౌరోహితమును గురించియు తగాదా ఏర్పడెను. అందును గురించి అనేక పండితులు, గ్రామస్థులు విచారించి విశ్వబ్రాహ్మణుల పరం తీర్పు చెప్పినను విప్రులు విననందున చిత్తూరు జిల్లా అదాలతు కోర్టునందు పండిత మార్గ సహాయాచార్యులు మొదలగు 11 మంది విశ్వబ్రాహ్మణులు వాదులుగాను, పంచాంగం గుండయ్య మొదలగు 9 మంది విప్రులు ప్రతివాదులుగను దాఖల్ కాబడిన వ్యాజ్యము అస్సల్ నెం 205/18 రు వ్యాజ్యమునందు 1818 డిశంబర్ 15 వ తేది యిచ్చినడిక్రిలో విశ్వబ్రాహ్మణులే బ్రాహ్మణత్వము కలవారనియు నానాజాతి ఋషుల గోత్రోత్పన్నులగు విప్రులకు బ్రాహ్మణత్వము సిద్ధింపజాలదనియు జడ్జి డేకర్ దొరగారు తీర్పు నిచ్చుటలో ప్రతి వాదులగు విప్రుల మాయలన్నియు మటు మాయమై పోయెను.

తదాదిగా రాజమండ్రి, బందరు, సేలం గుంటూరు, గోదావరి, కృష్ణా మొదలగు ఆంధ్ర దేశమునందలి కోర్టులలోనే గాక మైసూరు, సతారా, పూనా, మద్రాసు హైకోర్టు, బొంబాయి హైకోర్టు, తిరుచునాపల్లి జన్నార్, తానా, పటామ్, గంజాం మొదలగు కోర్టులయందు వ్యవహారములు జరిగి విశ్వబ్రాహ్మణుల పరమేయై యున్నవి. ఇట్లు అనేక కోర్టులయందు జరిగిన వ్యాజ్యములను తెలిసికొనియు ఇప్పటికిని విశ్వబ్రాహ్మణుల బ్రాహ్మణత్వమును శంకించుతూ వారి హక్కులకు భంగము కలుగ జేయుటకు ప్రయత్నములు చేయుట నిజముగా తమఅజ్ఞానమేకాని

వేయగాను. అజ్ఞాన జనితములగు వాక్యముల ద్వారా విప్రులకును విశ్వబ్రాహ్మణులకును ఉభయులకును గలిగె కష్ట నష్టములు సమానములేగాని యొకరికే సంబంధించినవి గావని రూఢిగజెప్ప సాహసించు చున్నాడను. ఇటీవల రాయవేలూరు తాలూకా రాయవరం గ్రామమునందలి విప్రులలో కొందరు విశ్వబ్రాహ్మణుల బ్రాహ్మణత్వమును ఖండించి వారి మామూలు హక్కుల భంగ పరచుటకు యత్నించు చున్నారని తెలిసియే నేని గ్రంథమును వ్రాయబూనితిని. గాన ఇందలి సత్యా సత్యముల గుర్తించి న్యాయమును అనుసరించుటకు మరొకసారి విజ్ఞప్తిచేయుచున్నాడను.

మహాశయులారా! గడచిన 60—70 సంవత్సరములనుండి విశ్వబ్రాహ్మణ సమాజములో జాగృతి కలుగుటవలన విశ్వబ్రాహ్మణ సమాజనాయకులు తమ సంఘీయులకు, అసూయా గ్రేసరులగు విప్రులు ఆపాదింపజేసిన వృత్తినామములు వడ్రంగి కమ్మర, కంచర, కంసాల, అగసాల, ఆవసల, సరాబు, సునార్ మొదలగు వాటిని వదలి తమజాతి నామముల విశ్వకర్మ, విశ్వబ్రాహ్మణ, ఆచార్య, దేవబ్రాహ్మణ, రథకారబ్రాహ్మణ, శిల్పిబ్రాహ్మణ, పాంచాలబ్రాహ్మణ, తక్షక, స్థపతి, ధీమాన్, జాంగిడాది నామముల వ్రాయవలయుననియు, వ్రాయించవలయుననియు, తమనామములకు మొదట బ్రహ్మశ్రీ యనియు చివర, ఆచార్య, శర్మ, స్థపతి జ్యోతుష్యులు, మొదలగునవి వ్రాయవలయుననియు వ్రాయించవలయుననియు వైదికాచారముల యందు శ్రద్ధ తీసికొని స్నానసంధ్య, జప, తప, హోమ, యజ్ఞాది ధర్మకర్మాను ష్ఠానములు చక్కగా నెరవేర్చుచుండవలయుననియు బోధించి సత్కర్మాచరణీయుల గావింప

మొదలిడినప్పటినుండియు మనదేశమున నుండు ద్విజ సంఘమునగొప్ప కలవరము బయలుదేరినది.

దేశమునకు గొప్ప ఉపద్రవ మేర్పడినది. నీచులు యజ్ఞయాగాదికర్మలు చేయుచున్నారు. వారే తమ యిండ్లయందలి వివాహాది వైదికకార్యములు స్వయముగా జరుపుకొనుచున్నారు. వివాహాది శుభకార్యములయందు పల్లకీ మెఱవణి జరుపుకొనుచున్నారు. మృతకళెబరములను కూడ ఊరేగింపుతో స్మశానములకు దీసికొని పోవుచున్నారు. దేవాలయములయందు విగ్రహములు వారే ప్రతిష్ఠించి స్వయముగా పూజలు జరుపుచున్నారు. నూతన గృహారంభ కార్యములందును వారే వాస్తుపూజ శంఖుప్రతిష్ఠలు జరిపించుచున్నారు. దీనిచే దేశానికి అరిష్టము గలుగుచున్నదనియు మేమే అగ్రజన్ములని విఱ్ఱవీగు జాత్యహంకారులు దేశమందంతటను గలభాలులేపిరి.

ఈదుష్ట ప్రభోదము పల్లెటూరు మొదలు పట్టణములలోని అమాయకుల నందరిని ఉద్రేకపరచెను బుద్ధిమంతులును దూరదృష్టిగలవారును యీ విషయమునందెట్టి జోక్యము కలిగించుకొనక మౌనము దాల్చియుండిరి. విద్వాంసులును పక్షపాత రహితులునగు విప్రులు విశ్వకర్మల బ్రాహ్మణత్వమును సమర్థించుటెగాక విశ్వకర్మలు బ్రాహ్మణులని పిలువబడుటవలన బ్రాహ్మణ జనసంఖ్య పెరిగి బ్రాహ్మణత్వమునకు లాభించునేగాని ఏలాటి హాని కలుగనేరదని బోధించిరి కాని ప్రయోజనము కలుగలేదు అగ్రజన్ముల మనుకొనే దురభిమాన దురహంకారులును, అసంపూర్ణులగు విద్యావంతులును అగు బ్రాహ్మణ బ్రువులు కొందరు నిరక్షరాస్యులు, శూద్రులు, మూర్ఖులు మొదలగువారిద్వారా విశ్వబ్రాహ్మ

ణులపై అమానుషములగు అత్యాచారముల జరిపించిరి. వారి వైదిక కర్మల భ్రష్టమొనరించిరి. కొట్టుటయు, తిట్టుటయు గాయ పఱచుటయు ప్రతి శుభకార్యములను ఆటంక పఱచుటయు జరుపబడినవి.

1846 సం॥రమున సేలంజిల్లాలో వైదిక కర్మాధికారమును గురించి వ్యాజ్యము జరిగి వైదికకర్మాధికారము విశ్వబ్రాహ్మణుల కున్నదనియు, అందుచే వ్యాజ్యము నెం 4 బరు 1846 సం॥ రం డిశంబరు 14 వ తేదిన వాది రామలింగాచారి మొదలగు విశ్వబ్రాహ్మణులకు ప్రతి వాదులగు వారు రు 136 0-0 లు అపరాధపు ఖర్చులు చెల్లించవలయునని డిక్రి యివ్వగా అంతటితో దుష్టులు తోకముడుచుకొని కూర్చుండిరి.

పిమ్మట చిత్తూరుజిల్లా అదాలతుకోర్టులో తీర్మానించిన వ్యాజ్యా నంతరము 1857 లో రాజమండ్రిలో విశ్వబ్రాహ్మణులకు జరుగ వలసిన మామూలు ఆచారమును భంగపరుప విప్రులు ప్రయ త్నించగా ఆతగాయిదాను గురించి కోర్టుకు వెళ్ళిరి. ఆవ్యాజ్యము రాజమండ్రి సరదాలత్ కోర్టులో నెం 141 బరుగా రిజిష్టరు కాబడి అది విశ్వబ్రాహ్మణుల పరమే డిక్రియివ్వబడినది.

మరికొంతకాలమునకు అనగా 1886 సం॥ రమున విశ్వ బ్రాహ్మణుల ఇండ్ల మంగళకార్యములు పబ్లికుగాను బాహటము గాను, జరుపుకొనుటకుగాని పల్లకీల యందు మెఱవణులు చేసు కొనుటకు హక్కు లేదని విప్రుల ప్రోత్సాహమున కొఱవి బసవన్న మొదలగు అరుమంది విశ్వబ్రాహ్మణుల పైన గొల్లపూడి వెంకట

సుబ్బయ్య వగైరా ఆరుమంది విప్రులు జరిపించిన వ్యవహారము బందరు కోర్టులో 1866 సం॥రమున నెం. 220 బరు గల వ్యాజ్యములో విశ్వబ్రాహ్మణులకు సకలాధికారములు గలవని డిక్రి యివ్వగా వాదులగు విప్రులు ఫలాయనము చిత్తగించిరి.

అటు పిమ్మట గోదావరి జిల్లాలో వాది విశ్వబ్రాహ్మణ పెదపూడి సూరయ్య గారికిని ప్రతివాది విప్రుడు అప్పిలిబుచ్చి వెంకటయ్య గారికిని నిందారోపణలపై జరిగిన మాన నష్టపు దావాలో కాకినాడ సబ్ జడ్జి కోర్టులో నెం. 179 బరు విశ్వబ్రాహ్మణుల పరమేకాబడి ప్రతివాదిపై ఖర్చులకు మాననష్టానికి డిక్రి యివ్వాబడినది. అంతటితో బుచ్చి వెంకటయ్యగారు వాలము తెగిన వృశ్చిక రాజమువలె కూర్చుండిరి.

మరికొంతకాలానికి గుంటూరుజిల్లాలో జానపాడు గ్రామంలోని పట్టాభిరామయ్య అను విప్రపండితుడు పత్రికల ద్వారాను, గ్రంథములద్వారాను విశ్వబ్రాహ్మణులపై కొంతకాలము విపరీత ప్రచారము చేసిచేసి తుదకు విశ్వబ్రాహ్మణులు చేసిన దేవి ప్రతిష్ఠను గురించి తమ విపరీతపు వాదనను చెల్లించుకొనవలయునని విశ్వబ్రాహ్మణ జాతీయులగు ఓలేటి లక్ష్మయ్య మొదలగు అయిదుమందిపై గుంటూరు జిల్లాకోర్టులో నెం.26/1911 బరుగా తెచ్చిన దావాను న్యాయాధికారి విచారించి ధర్మశాస్త్రానుకూలముగా విశ్వబ్రాహ్మణులకు ప్రతిష్ఠాధికారము కలదనియు జానపాటి పట్టాభిరామయ్యగారు తెచ్చిన దావా సరియైనది కాదని విశ్వబ్రాహ్మణులకు అనుకూలముగా తీర్పునిచ్చి నందున అంతటితో తన విపరీత ప్రచారమునకు స్వస్తిజెప్పి నింటిలో కూర్చొనిరి.

ఆంధ్రదేశము నందిట్లుండ అటు కలకత్తా యందలి మార్వాడి బ్రాహ్మణ పత్రిక సంపాదకులగు హనుమాన్ జోషీ గారు జాంగిడ బ్రాహ్మణు (విశ్వబ్రాహ్మణు) లకు విరుద్ధముగా భారతదేశము నందంతట బ్రహ్మాండమైన ఆందోళన లేవదీసెను. ఈ విరోధాగ్నిని ప్రజ్వాలింప జేయుటకు ఆయన, ఆయన సహయులు విశ్వప్రయత్నములు జేసిరి. రాజపుత్ర స్థానములోని విశ్వ బ్రాహ్మణులను సాముదాయక పాలములు అడవులు, నూతులు, మొదలగువాటి నుపయోగించుకొన నీయక అడ్డగించి నిత్యజీవిత మునుకూడ సరిగా సాగనీయక నానా బాధలు పెట్టిరి. అట్టి సమయమున డిల్లీయందలి జాంగిడ బ్రాహ్మణ మహాసభ వారు పండిత పరశురామశాస్త్రి గారు మార్వాడి బ్రాహ్మణ పత్రిక పైనను ఆ పత్రికాధిపతి హనుమాన్ జోషీగారి పైనను అతని సహాయకుల పైనను అభియోగము తిసుకరావలసి వచ్చెను. అట్టి కేసులో లాహోరునందలి "బ్రాహ్మణ సమాచార్" పత్రిక సంపాదకుడును. బొంబాయినందలి "వెంకటేశ్వర పత్రిక" సంపాదకుడును. ఢిల్లీయందలి "హిందూ సంసార్" పత్రిక సంపాదకుడును. క్షమాపణ వేడికొనిరి. కాశీ పండితుడగు "అనంతరామ డోగ్రా" గారుకూడ రాజీచేసికొని తప్పించుకొని పోయెను. కలకత్తా లోని మార్వాడీ బ్రాహ్మణ పత్రిక సంపాదకునిపై వారంటు బెట్టి అరెస్టుచేసి రప్పించబడెను. కాని ఆగర్వాషి క్షమాపణ కోరక తన పక్షమున వాదించుటకు భారతదేశ మందలి గొప్ప గొప్ప ప్రసిద్ధ పండితులను కోర్టుకు తిసుకవచ్చెను. కలకత్తా నుండి అనంత కృష్ణశాస్త్రియు, భవాని నుండి సీతారామశాస్త్రియు, కాశీ నుండి లక్ష్మణశాస్త్రియు, ద్రవిడ ప్రాంతమందలి బిడావాలోని

దేవకీ నందనశాస్త్రియు భారతదేశపు ప్రసిద్ధ విద్వాంసుడు అఖిలానంద మొదలగు పదకొండుగురు పండితులు సాక్ష్యమిచ్చిరి. చివరకు హనుమాన్ జోషీకి రెండువందల రూపాయల జరిమానా అది చెల్లించనిచో రెండు మాసముల శిక్షగాని అనుభవించవలెనని తీర్పు నివ్వబడెను. అంతటితో తమ వితండ వాదములకు స్వస్తి జెప్పి పరాజయమును చిత్తగించవలసి వచ్చెను. చూచితిరా! కోవెల పిల్లను కాకి పిల్లగా రూపొందించుటకు చేసిన ప్రయత్నము లెట్లు విఫలములైనవో గమనింతురు గాక. భారతదేశము నందతటను ఇట్లే విశ్వబ్రాహ్మణుల బ్రాహ్మణత్వమును మలిన పరుప ప్రయత్నించిన వ్యవహారములలో మొత్తము నేబది వ్యాజ్యములలో విశ్వబ్రాహ్మణులు తమ విజయ పతాకముల ప్రకాశింప జేసిరి. ఈ కారణముల వలన భారతదేశమున విశ్వబ్రాహ్మణుల పై వ్యాపించి యున్న విరోధాగ్నిజ్వాలలు చల్లారి, పోయినవి. విరోధులనోళ్లకు తాళములు వేయబడినవి. బాహాటముగ విరోధించడము నిలచిపోయినది. వ్యాజ్యములలో విశ్వబ్రాహ్మణుల పక్షమున బయలు పరచిన ప్రమాణములన్నియు ఖండన సాధ్యములుగావని పండితుల కందరకు స్పష్టమై యున్నందుననే తమ దుష్ట వాదముల నుపసంహరించుకొనిరి. కాని ఇంకను అచ్చటచ్చట పల్లెటూళ్లలో అప్పుడప్పుడు అసంపూర్ణ పండితులును, జాత్యభిమాన గర్విష్టులును, అగుకొందరు బ్రాహ్మణు డనవెట్టివాడు ? బ్రాహ్మణత్వమునకు మూలమేమి? బ్రాహ్మణ కర్మములనేవి? బ్రాహ్మణుని విహిత ధర్మములేవి ? యను విషయములు బొత్తుగా తెలియకనే తెలుసుకొనుటకైనా ప్రయత్నించకనే నిరంతరము దాస్య వృత్తితోను, సేవకా వృత్తితోను, నింద్యమగు

పౌరోహిత వృత్తితోను, పీనుగుల కొఱకు పరువులెత్తు వాయసముల వలె సంతర్పణలకు పరువులెత్తుచూ కాయ కష్టోల్లంఘనులై పరాన్న భోజనా సక్తులై జీవించుచు "ఇంటిపేరు కస్తూరి యిల్లును అందున్నది గబ్బిలముల వాసన" యున్నట్లుగా వర్తించుచు జీవించుచుండువారు. అగ్రజన్ములమని వాదించుచూ టంకశాలలో తయారైన బ్రాహ్మణ బ్రువులు కొందరు తమతోటి అవసరములు కలిగి విద్యా విషయాదుల నెఱుంగని గ్రామ పెద్దల లోబఱచు కొని, సర్వమానవుల సమానదృష్టితో పాలన సాగించుచుండు నేటి కాంగ్రెసు పాలనము నందు కూడ పల్లెటూళ్లలోని విశ్వబ్రాహ్మణులకు జరుగుచుండు మామూలు మర్యాదలను ఆటంక పఱుప బూనుట బేధములరేకెత్తింప బూనుట ఆశ్చర్యకరము. అంతే గాదు దుష్టకార్యమనుటగూడ తప్పుగాదు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అను నాలుగు జాతులే వేదముల యందును, పురాణముల యందును గలవు. విశ్వ బ్రాహ్మణులని యెచ్చట వ్రాయలేదని హ్రస్వ దృష్టిగల కుపండితులు కొందరు కువాదములు జేయుచున్నారు. ఇది చాల విపరీతము. మనకన్నులెదుట గాన్పించుచు తమ తమ సంఘముల అభ్యున్నతి కొఱకై సాంఘికముగ, రాజకీయముగ పాటు బడుచుండు జాతుల వారందరు యే వేదములనుండి యుత్పన్నమైయున్నారో యీ పండితులు చెప్పగలరా? బ్రాహ్మణు లనగా వైదికులు, స్మార్తులు, కరణాలు, నియోగులు, మొదలగు అరువది నాలుగు తెగలవారున్నారు. మరియు వైష్ణవులను వారుకూడ బ్రాహ్మణులనే పిలువబడు చున్నారు. అందులోను శ్రీ వైష్ణవ, పురుష వైష్ణవ, వడహల, తెంగల, యను పేర్లతో పిలువబడు

చున్నారు. అంతేకాదు. మధ్వులనువారును బ్రాహ్మణులనియే పిలువబడు చున్నారు. ఇట్లే అనేకులు బ్రాహ్మణుడన నేమియో బ్రాహ్మణశబ్ద మెవరికి వర్తించునో బ్రాహ్మణుని వర్తనమేమిటో వృత్తియేమిటో తెలియకనే తెలుసుకొనుటకైనా ప్రయత్నించకనే స్నాన, సంధ్యా, ధ్యానుష్ఠానకర్మల నెఱుంగకనే ఆచరించకనే, యజ్ఞ యాగాదుల పేరునను, భాగవత కైంకర్యములను పేరునను జీవహింసలు జేయుచు మాంస మధ్య పానాదుల సేవించుతూ మేమే అగ్రజాతివారమని దుర్వాదనలు జేయుట బుద్ధిమంతులు విశ్వశింప జాలరు. శైవ, స్మార్త, వైష్ణవ, మధ్వులను పేరున పిలువబడుతు అందరును బ్రాహ్మణ జాతివారమనే వాదించు వారిలో యెవరెక్కువ, యెవరుతక్కువ యను విషయము చర్చించితే ఎంత తమాషాగ యుంటుందో బుద్ధిమంతు లూహించండి స్మార్తులు నియోగులు మొదలగు పేర్లుగల వారందరు నొకరితో మరొకరు సపంక్తి భోజనాదులే గాక ఇచ్చిపుచ్చుకొని వివాహాదులు జరుపుకొనుటయు గూడలేదు. మరి వైష్ణవులనబడు వారితో తదితర బ్రాహ్మణు లనబడువారు సంబులుకూడ భోజన బాంధవ్యాలు, జరుపకపోవుటయే గాక వారిలో వారే వడహల తెంగల యను భేదములతో ఒకరితో నొకరు కలువరు. మధ్వులను వారితో ఈ వైష్ణవులనువారు అన్నివిధముల కలువరు. ఇట్టి వ్యత్యాసముల నన్నిటిని ఏ వేదములు ఏ పురాణములయందు చూపించ గలరో యోచించుట బుద్ధిమంతుల లక్షణమై యున్నది.

అగ్రజాతి వారము మేమే యనుటకు రూపొందించుకొనిన ధర్మశాస్త్రములయందు "శూద్ర సమీపేనా ధ్యే తవ్యః. శ్రవణేత్ర పుజతుభ్యాం, ఉచ్చారణే జిహ్వాచ్ఛేదః. అర్థా వధారణే హృదయ

విదారమితి" (కాత్యాయని సూత్రము) అనగా శూద్రుని సమీపమున వేదము చదువ కూడదనియు, చదవగా వినినను చెవులలో సీసము కరిగించి పోయవలయుననియు, వేదము చదివిన నాలుక తెగకోయ వలయుననియు, అర్థము తెలుసుకొన్న కడుపునుచీల్చ వలయుననియు వ్రాయబడిన తమ పూర్వపు పెద్దల ఆజ్ఞల నుల్లంఘించి అందులకు విరుద్ధముగా తమజాతి వారల కంటె తక్కువ జాతివారని రూపొందించుచున్నవారి వద్దనే సేవకావృత్తులు జేయుటయే గాక దాస్యము ననుభవించుతూ నీచులుగా రూపొందించిన కడజాతి వారలకు సైతము చేతులెత్తి మ్రొక్కుచూ వారివద్దనే చదువులు నేర్చుకొనుచూ ఆ ఖరుకు వీధులలో కూడ తిరుగకూడదని వెలివేయబడిన అంత్యజాతి వారు త్రాగిన బావులలోని నీరు శాస్త్ర నిషిద్ధమనియు తమ పద్ధతికి వ్యతిరేకమనియు తెలిసియుండియు అట్టినీరు నుపయోగించుకుంటూ ధర్మశాస్త్రమునకు బ్రాహ్మణ ధర్మమునకు వ్యతిరేకమైన మధు, అన్నవిక్రయశాలల ద్వారా తమ జీవితములు జరుపుకుంటూ అందరు ముట్టుకొన్న ఎంగిలి గిన్నెలలోనే ఆహార పానీయము లొనర్చుతూ ఇవన్నియుగాక తనవృత్తి ఏమిటో తెలుసుకొనక తెలిసికొనుటకు ప్రయత్నించక తెలుసుకొనినవారు సైతము ఆచరణశూన్యులై నేటికిని అగ్రజాతి వారము మేమేయని ప్రగల్భములు గొట్టుచూ గ్రామాలలో కొన్నిజాతుల వారికి పూర్వకాలము నుండి జరిగెడు మామూళ్ల మర్యాదలను భంగ పెట్టుటకు యత్నించుట అడ్డంకులు గలిగించుట వివేకమైన పని గాదని మరొకతూరి హెచ్చరించు చున్నాడను.

విశ్వబ్రాహ్మణులను నకలు బ్రాహ్మణులనియు, బ్రాహ్మణత్వము లేనివారనియు వాదించెడి మొండివాదమును జరుపు వారే బ్రాహ్మణులు కాదని నిరూపించుటయే యీ గ్రంథము నందు ధృవపరచవలసి వచ్చినది. నకలు ఏదో అసలేదో తెలుసు కొనుటకు గీటురాయిగా ఈ గ్రంథమును వ్రాశి యున్నాను. హిందూ సంఘమున వర్ణములు రెండు విధములుగా గుర్తించ బడుచున్నవి. ఆర్యసమాజికులు కర్మచేతను సనాతనులు జన్మ చేతను జాతిని యొప్పుకొనుచున్నారు. విశ్వబ్రాహ్మణులు జన్మ కర్మరెండింటి వలనను బ్రాహ్మణులనియే వారి అధికార పూర్వక మగు వాదము.

(ఎవరిని బ్రాహ్మణులని పిలుతురు? శాస్త్రమున బ్రాహ్మణునకు ఏయర్థమిచ్చి యున్నది? అన్యమానవులకన్న ఎక్కువ జ్ఞానము గలవాడును విజ్ఞానియునైన వానికి హిందూసమాజమున బ్రాహ్మణనామము గలదు. జ్ఞానము తర్వాత విజ్ఞానము తెలిసి కొనియుండు వానిని అనగా శిల్ప విద్యలో నిపుణుడైనవానిని విజ్ఞానియందురు. జ్ఞానవిజ్ఞానముల రెండింటియందును పూర్ణప్రజ్ఞ గలవానిని బ్రాహ్మణుడని చెప్పియున్నది. వంటచేయుట, కావలి గాయుట, రైల్వేలో ఫిట్మెన్‌పనిచేయుట, గణికుడుగా నుండుట, పౌరాణికుడుగా నుండుట, సేవకావృత్తితో నుండుట, వ్యాపారిగా నుండుట, అన్నవిక్రయశాలలు జరుపుట, ఎంగిలి పాత్రలు కడుగుట, కూలికి పనిచేయుట ఇవి ఏధర్మశాస్త్రము లందును బ్రాహ్మణుమని కర్మలుగా చెప్పబడి యుండలేదు. కాని నేడు బ్రాహ్మణుల మని చెప్పుకొనేవారు లక్షలాదిగా పైచెప్పిన నీచకర్మల ద్వారా తమ జీవితములను నడుపుకొంటూ వుండడము బ్రాహ్మణులని

పిలువబడుచుండడము మనము జూచుచునే యున్నాము. కేవలము సనాతలనుమను సంబంధముచేతనే వీరందరు తమ జన్మచేత బ్రాహ్మణులమని చెప్పుకొనుటకు కారణములై యున్నవి.

బ్రాహ్మణులమని చెప్పుకొనే విప్రులగువీరు ఏ ఋషులను తమగోత్ర ఋషులుగా జెప్పుకొనుచున్నారో ఆ ఋషులలో చాలా మంది నీచస్త్రీ గర్భసంజాతులురనియు చాలామంది ఋషులు నీచజాతి వారనియు ఉపనిషత్తుల వలనను, శాస్త్రముల వలనను, పురాణముల వలనను దెలియుచున్నది. నీచజాతికి జెందిన వారయ్యు ఆ ఋషులలో కొందరు తపః ప్రభావమువలన బ్రహ్మత్వమును బొందిరి దీని విస్పష్టాభిప్రాయమే మనజన్మతః వీరు బ్రాహ్మణులు కారనియు తపశ్శక్తిచే బ్రాహ్మణులైన వీరిపేరనే గోత్రములు వెలసినవనియు స్పష్టమగుచున్నది కదా! అందుచే వారి సంతానముకూడ పైవిధముగనే తయారైన బ్రాహ్మణులేయై యున్నారు. అనగా వారి సంతానము "జన్మనా బ్రాహ్మణాధ్యేయః అను ప్రమాణమునకు వ్యతిరేకమగు "జన్మ నాజాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః. వేదపాఠంతు విప్రాణాం, బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణాః" యని వీరు వ్రాసికొన్న ప్రకారమైనను బ్రహ్మజ్ఞానములేనందున బ్రాహ్మణులమని చెప్పికొనుటకు గూడ అధికారము లేదు.

జన్మనా బ్రాహ్మణాధ్యేయః, కర్మణ బ్రహ్మచారిణః. వేద పాఠేన స్వాధ్యాయా, బ్రహ్మజ్ఞానేనవేత్తయే" యను ప్రమాణము రీత్యా విశ్వబ్రాహ్మణులు జన్మచేతనే బ్రాహ్మణత్వము గలవారై యున్నారన్న విషయము గుర్తుయందుంచుకొందురుగాక,

"విశ్వకర్మ కులేజాతః గర్భబ్రాహ్మణ నిశ్చయం, శూద్రత్వంనాస్తి తద్వంశే బ్రాహ్మణో విశ్వకర్మణః॥ (శిల్పశాస్త్రము) "జన్మనా జాయతే శూద్రః" జన్మయెత్తి పుట్టినపుడు అందరు శూద్రులని వప్పుకుంటూ శూద్రసమీపే నాధ్యేతవ్య" యని ధర్మము వ్రాసి అందులకు వ్యతిరేకముగా శూద్రసమానుడగు శిశువుకుచేయు జాతకర్మయందు "తాభ్యామేవ మూర్ధన్యవ ఘ్రాణం అంగాదంగా త్సంభవసి జిఘ్రామి తాభ్యామేవదక్షిణ కర్ణేజ పంచకృత్వా" అనగా శిశువుయొక్క కుడిచెవినందు మంత్రమును జపించమని వ్రాయుట త్రాగినవాడు భార్యను అమ్మాయని పిలిచినట్లుండుట లేదా? ఇట్టి ఉదాహరణములను బట్టిచూడ తమజాతి పుట్టుకతోడనే శూద్రులై క్రమ క్రమముగా ద్విజుడై, విప్రుడై, బ్రాహ్మణుడైనట్లు తాము వ్రాసుకున్న శాస్త్రములే ప్రమాణములై యుంటున్నవి గదా! గనుక వీరు పుట్టినప్పటి నుండి ఏసంస్కారాదులు లేకనే బ్రాహ్మణుడనని చెప్పుకొనుటకు అధికారములేదని యిందువలన తెలియుచున్నది. "విశ్వబ్రహ్మ కులేజాతః గర్భబ్రాహ్మణ నిశ్చయం, శూద్రత్వం నాస్తి త్వదంశే బ్రాహ్మణో విశ్వకర్మణః" యను ప్రమాణము చొప్పున విశ్వ బ్రాహ్మణుల పిల్లలకు గర్భమునందే బ్రాహ్మణత్వ మేర్పడు చున్నది. అందుచేతనే పుంసవన, జాతకర్మాదులయందు వేద మంత్రములతో సంస్కారములు జరుపబడుచున్నవి అందుచే "యస్మాద్బీజ ప్రభావేన తస్మాద్బీజ సముద్భవం" అను ప్రమాణ మునుబట్టియే విత్తనమునాటిన అద్దానికి సంబంధించిన చెట్టు మొలచినటే బ్రాహ్మణ బీజమునకు బుట్టినవాడు బ్రాహ్మణుడు గానే జన్మించునని అందరికి తెలిసియేయున్నది గదా!

ఇక్కడ విప్రులును విశ్వబ్రాహ్మణులును బ్రాహ్మణత్వ మును గురించి వ్రాసికొన్న పైరెండుశ్లోకములను వాని అర్థమును వ్రాయుచున్నాను. చదువరులు యథార్థమును గ్రహింతురు గాక.

"జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః వేద పాఠంతు విప్రాణాం, బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః. అనగా జన్మ యెత్తి పుట్టినవారందరు శూద్రులనియు, ఉపనయనాది కర్మలు జేయుటచే ద్విజులగుదురనియు, వేదపఠనము చేయుటచే విప్రు లగుదురనియు బ్రహ్మజ్ఞానము వలన బ్రాహ్మణు లగుదురనియు పైశ్లోకముయొక్క అర్థము, ఇకరెండవ శ్లోకముయొక్క వివరము. "జన్మనా బ్రాహ్మణాధ్యేయః కర్మణ బ్రహ్మచారిణ. వేదపాఠేన స్వాధ్యాయ బ్రహ్మజ్ఞానేన వేత్తయే" అనగా బ్రాహ్మణ జాతికి పుట్టినవాడు బ్రాహ్మణుడేయనియు, ఉపనయనాది కర్మలుచేయు టచే బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు మొదలగు పేర్లుగల వాడగుననియు, వేదపఠనముచే స్వాధ్యాయుడనియు బ్రహ్మ జ్ఞానముచే బ్రహ్మ వేత్తయగుననియు అర్థము.

ఈ విషయములందు యెవరికైనా సందేహము కలిగినచో అట్టి విప్రులు తమగోత్ర ప్రవరలవ్రాసి పంపిన మేము వాటిని పురాణములను గీటురాయిపై ఒరిపిడిపెట్టి వాటియదార్థ స్వరూప మును దెలియజేయుచున్నాము. శ్లో॥ కూటస్థరహితం లోకం కూట స్థరహితాన్వయం, కూటస్థరహితం మంత్రం యంత్ర కృత్యాప్య సంభవః॥ అనగా కూటరహితమైన లోకము గాని, జాతి గాని, మంత్రముగాని, యంత్రముగాని వుండనేరదని శాస్త్రములవలన దెలియుచున్నది. కూటస్థం అనగా తనజాతికి, వంశమునకు మొట్ట మొదటివాడని తెలుసుకొనవలయును. ఎవరైతే బ్రాహ్మణులమని

చెప్పుకొనుచున్నారో అట్టివారు "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" అనగా బ్రహ్మముఖమునుండి పుట్టినామని చెప్పుకొనుచు బ్రహ్మ యొక్క గోత్రసూత్రాదులను చెప్పికొనుటగాని బ్రహ్మను పూజించుటగానిలేదు. ఇది ఎంతటివైపరీత్యమో పెద్దలుగమనింతురుగాక.

వీరు తమగోత్ర పురుషులుగా చెప్పుకొనే ఋషులు అనగా వసిష్ఠ, వాల్మీకి, నారద, విశ్వామిత్రాది ఋషుల జననముల గురించి కొంత దెలిసికొందము. బ్రహ్మకు మొట్టమొదటి కొడుకు వసిష్ఠుడు ఎట్లనగా దేవసభయందు నాట్యముజేయుచుండిన ఊర్వశి యనువేశ్యను జూచిమోహించి తనస్థితికి తగనిపని యని యోచించకనే యావేశ్యను పట్టి రమించగా యావేశ్యగర్భమున పుట్టినవాడు వసిష్ఠుడు. ఈ వసిష్ఠునిభార్య అరుంధతి, జాంబవంతునికూతురు. జాంబవంతుడు మాదిగె. యీ వసిష్ఠ అరుంధతికి పుట్టినవాడు శక్తిముని, యాశక్తిమునిభార్య శ్వపచాత్మ యీాయమ మాలజాతిపడచు. వీరిద్దరికి పుట్టినవాడు పరాశరుడు. పరాశరుడు వివాహముకానట్టి బెస్తకులమునకు చెందిన మత్స్యగంధి (అనగా చేపలవాసనగలదాని) ని పట్టపగలు పడవయందు రమించగా పుట్టినవాడు వ్యాసుడు. ఇతను మహావిద్వాంసుడై "వ్యాసోనారాణో హరిః" యని పేరుగాంచెను. చూచితిరా! వీరి గోత్రములయొక్క మూల పురుషులచరిత్రము. ఇందుకనే బ్రహ్మవేత్తయైన వేమన యోగీంద్రుడుకూడా ఇట్లు చెప్పియున్నాడు.

"తనదు తల్లి లంజ తనయాలు మాదిగ
తాను బ్రాహ్మడనగ తగునె జగతి
తపసుచేత ద్విజుడు తర్కింపకులమేది
విశ్వదాభిరామ వినురవేమా॥

"మాదిగె యనగానె మరి తక్కువందురు
మాదిగె యిల సురల మామగాదె
మాదిగెకును బిడ్డ మరి యరుంధతిగదా
విశ్వదాభిరామ వినుర వేమ॥

"కౌండిన్యుడు ముండకొడుకు
మాండవ్యుడు కప్ప కడుపు మహిలోబుట్టెన్
చెండామతంగ మౌనియు
పిండంబై పుట్టలేద ప్వధివినివేమా॥

"కడుపేద పరాశర్యుడు
చెడుమాల గరిత కడుపున జెలగి జనించెన్
వడి వేదవ్యాసుడును చెం
బడిదానికి జాతమయ్యె బాడిగవేమ॥

"చాకల దానికి బుట్టెను
చేకొని యానారదుండు చెప్పగనేలా ?
లోకా లోకము లెల్లను
యేకముగా రూఢికెక్కె యెరుగవె వేమా॥

"శ్రవణగురు వసుధ కుక్కకు
వాసిష్టుడు నూర్వశికిని జనియించెను బల్
అసహ గౌతమ మునియున్
బొసగంగా మకరి కిలను బుట్టెను వేమా॥

"ఇటువంటి ఋషి కులంబున
బటుతరముగ బుట్టినట్టి బాపనవారల్
కుటిలంబు గాన లేకను
యటు బ్రహ్మ కులంబనంగ నమరునె వేమా॥

"చిలుక గర్భమందు జెలగి శుకుడు బుట్టె
మరల జాతమయ్యె ఖరము కిలను
ఇట్టి ఋషికులంబు నెంచంగ పనిలేదు ॥విశ్వ॥

"తాత గన్న తల్లి తమ తండ్రి గను తల్లి
తన్ను గన్న తల్లి తల్లి తల్లి
తల్లి శూద్రురాలు తానెట్లు బ్రాహ్మణుడు ॥విశ్వ॥

"మాతంగులు ముది మనములు
భూతలమున బ్రాహ్మణులగు పొలుపుగ నానా
జాతికి బుట్టిరి విప్రులు
ఖ్యాతిగ నిధరణి జెడియె గదరా వేమా॥

"మాలలకునుబుట్టి మాలల దూషింప
ద్విజుల కేల యిట్టి దొంగతనము
తొలుత జన్మమైన తొత్తును జూడరా ॥విశ్వ॥

"భారతమున బలుకు పలుజాతి విప్రులు
కొత్తు కురియలేని కూడ జాతి
వసుధ బాపడౌనె గోసంగి యల్లుడు ॥విశ్వ॥

అని తత్వవేత్త బ్రహ్మవేత్తయైన వేమన్నగారు గూడ చెప్పియున్నారు. ఇచ్చట నొక చిన్నవిషయము చదివి అవల కెళ్లుదము. సినిమా హరిశ్చంద్రలో వీరబాహుకుడు పాడినపాట

చిన్న కత్తి పెద్ద కత్తి నాదే నయ్యా
చిందేసె వీరబాహు నేనేనయ్యా ॥చి॥
తాలేలిల్లి యల్లో శివతాలేలిల్లి యల్లో
చర్మానికి జాతెక్కడున్నది
ధర్మానికి జాతెక్కడున్నది
ప్రపంచ మంతా నాటకము కని
పించే దంతా బూటకము ॥తాలే॥
కుక్కను కోతిని కొల్చుచుందురు
పందిని నందిని పూజ జేతురు
తోడి మానవుడు ఎదురైతేనే
దూర దూరముగ తొలిగి పోదురు ॥తాలే॥
శునక గర్భమున జన్మించిన యా
శౌనక ముని గోత్రమ్ము సెప్పరా
కుండలో పుట్టిన అగస్త్య మహాముని
కులమేధో విప్పి చెప్పరా ॥తాలే॥
వసిష్టుండు ఊర్వశికి బుట్టెరా।
బోయ యింట వాల్మీకి బుట్టెరా।
తీగ లాగితే డొంక కదులురా।
అరుంధతి మాఆడ బడచురా ॥తాలే॥

రక రకాలుగా కులాలులేవు. రంగు రంగులా మతాలులేవు. కలిగిన వాడిదెగొప్ప కులమురా లే వాడిదె లేకి కులమురా।

అన్నాడు మనరాజ్యం పిక్చర్సువారి "హరిశ్చంద్రలో" వీర బాహుకుడు—రచన జంపన కొసరాజు —పాడింది ఘంటసాల గమనించండి,

పై వేమన్నగారే విశ్వకర్మ బ్రాహ్మణులను గురించి చెప్పిన పద్యములుగూడ విందము.

ఆ॥ మొదట బ్రహ్మమనువు మొనయరెండు మయుడు
మూట త్వష్ట శిల్పి మొనయ నాల్గు
విశ్వకర్మ నెగడె విశ్వజ్ఞుడెదింట
విశ్వదాభిరామ వినురవేమ॥

కం॥ త్రిజగంబుల నిర్మించియు
త్రిజగంబుల భుక్తి ముక్తి దీఱచినడుపన్।
యజహరి రుద్రులు దానౌ
భజియింపగ విశ్వకర్మ బ్రహ్మమువేమ॥

ఆ॥ దేవ పూజలందు దేవాలయములందు
దేవుడనుచు మ్రొక్కి తెలియలేరు।
తెలియ విశ్వకర్మ దేవాది దేవుండు ॥విశ్వ॥

ఆ॥ విశ్వకర్మ లేని విశ్వంబు మఱిలేదు
కుడువగూడు లేదు కోకలేదు
విశ్వమయుడు నైన విభునేల దెలియరో ॥విశ్వ॥

ఆ॥ శిల్పికన్న గురుడు సీమ నెవ్వడులేడు
శిల్పి జెప్పిన గుఱి సీమ కెల్ల
శిల్పి దిట్టిన యెడ శ్రీశుని దూషించి
నట్టు గాదె వినుము యవని వేమ॥

ఆ॥ విశ్వకర్మ లేక విశ్వంబు లేదురా
విశ్వకర్మ జేసె వెలయు వాని
విశ్వకర్మ లేక విశ్వంబు లేదురా ॥విశ్వ॥

ఆ॥ మొదట మంచి కులము పిదప నానా జాతి
యిట్టి జాతికన్న హెచ్చులేదు
కంసలికిని మించు ఘనజాతి లేదయా ॥విశ్వ॥

ఈ కడపటి పద్యము పైయన్ని పద్యములకు వ్యతిరేక ముగా నున్నట్లు అగుపడుచున్నది. కడగీటులో కూడ ఘనజాతికి బదులు కడజాతి అని దిద్దినట్లు తెలియుచున్నది.

అయితే వేమన్నగారు ఇటీవల వాడుగదా! ఇతను చెప్పినవి ఎట్లు ప్రమాణములగునని యడిగెదరేమొ ? ఇదే విషయమును బలపరచునట్టి వజ్ర సూచ్యాది కోపనిషత్తులలోను, భారత, భాగవత, రామాయణ, భవిషత్పురాణాది గ్రంథములయందును, నిరూపింపగలము.

బ్రాహ్మణ శబ్దమును గురించి వజ్రసూచికోపనిషత్తునందు యీ క్రింది విధమున చెప్పబడియున్నది. గుర్తించుదురు గాక. ....... తర్హిజాతి ర్బ్రాహ్మణ ఇతిచేత్తన్న తత్ర జాత్యంతర జంతుష్వనేక జాతి సంభవాత్ మహర్షయో బహవస్సంతి, రుష్యశృంగో మృగ్యాః, కౌశికః కుశాత్. జాంబూకో జంబుకాత్, వాల్మీకో వల్మీకాత్, వ్యాసకైవర్త కన్యాయాం, శశపృష్ఠాద్గౌతమః, వసిష్ఠ ఊర్వశ్యాం, అగస్త్యః కలశేజాతః, ఇతిశృతత్వాత్, ఏతేషాం జాత్యాని నాప్యగ్రే జ్ఞానప్రతిపాది తారుషయో బహువస్సంతి తస్మాన్నజాతి ర్బ్రాహ్మణ ఇతి అనగా జాతి బ్రాహ్మణ అందామా అంటేన్నః' కాదు. ఎందుచేత నంటే జాత్యంతరమైన జంతు జాలములకు పుట్టిన మహర్షులనబడువారు. బహువ, అనేకమంది, స్సంతి, ఉంటున్నారు. యెవరనగా రుష్యశృంగుడు జింకకును, కౌశికుడు దర్భయందును, జాంబూకుడు నక్కకును, వాల్మీకుడు బోయకును, లేక పుట్టయందును, వ్యాసుడు కైవర్త కన్యక (బెస్తవనిత) కును, గౌతముడు కుందేటికిని, వసిష్టుడు ఊర్వశియను వేశ్యకును అగస్త్యుడు కలశమునందును, జాతః, పుట్టినట్లు, శృతత్వాత్,

శృతులు చెప్పుచున్నవి. యీ కారణముల వలన పుట్టుక వలన బ్రాహ్మణత్వము కలుగదని చెప్పబడినది. మరియు భవిష్య పురాణము చత్వారింశాధ్యాయము నందలి విషయమును గమనింపుడు. మున్ను మహర్షులు సుఖాసీనుఁడగు సురజ్యేష్టుని యొద్దకేగి నమస్కరించి యో మహాబాహూ! విశ్వామిత్రునకు గలిగిన విప్రత్వమును గురించి గొప్ప విస్మయము జనించుటచే జాత కౌతూహలులై భక్తిశ్రద్ధా సమన్వితులై వినయానత శిరస్కులై యిట్లు లడిగిరి. ఓ బ్రహ్మ! మొదటి కల్పమున బ్రాహ్మణ్య మనగా జాతి యధ్యయనము, దేహాత్మ సంస్కారములు, నాచార కర్మలు నను వానిలో నెయ్యది యగును. మనోవాక్కాయ కర్మ జాతి ద్రవ్య గుణాత్మకములగు బాహ్యములు నాభ్యంతరములు నైన సామాన్య విశేషములు కృత్రిమములా? ప్రసిద్ధములును వాస్తవములునగు జాతిబేధ విధాయకములు పరోక్షములగు ప్రమాణములచే నిశ్చితములుగా మివిడువ వలయునా? మనుష్యుల జాతిభేద విధి యవ్యక్తమగు నాగమముచే సిద్ధించు చున్నదా? ఇట్టి వికల్పముండుటచే బ్రహ్మజ్ఞానమున బలము తగ్గు చున్నది. వచింపుమన వారికి బ్రహ్మ యిట్లనియె. ఓ మునులారా! మీరు వాక్రుచ్చిన యంశము సత్యమే! అది యట్లుతే సందేహింప బనిలేదు. శిష్యుల శ్రేయమునకై తర్కించి వచించిన యోగీశ్వరుని వచన మాలకింపుడు. వేఱువే అర్థముల బోధించు విరుద్ధ ప్రమాణములు ప్రసిద్ధములై యుండుటచే జాత్యాదులచే బ్రాహ్మణ్యము నిర్ధరింపరాదని యోగీశ్వరుడు వచించు చున్నాడు. దాని వివరింతు వినుడు. స్పష్టమై యోగ్యమగు నర్థమును విశదీకరించు ప్రమాణము ప్రత్యక్షముగా దెలిసికొను చున్నారు.

సామాన్యము, నతీంద్రియములునగు సర్వ విషయములు గ్రహించునది సిద్ధాంతమని యొప్పుకొను చున్నారు. సర్వశక్తి సంపన్న మగుట నదియొక్కటియే ప్రమాణమని మాత్ర మెంచ రాదు. అట్లు లంగీకరించిన నీ విధముగ ననేక సంకటములు వికల్పములగును. వేదము యొక్క యపౌరుషే యత్వము నిత్య మగు జాతిని నిరూపించును. వేద మపౌరుషేయ మగుటచే వేదోక్త కర్మలెల్ల నాచరింపవలయును. దీనిచే వైదిక కర్మాచర ణము బ్రాహ్మణ్యమని తెలియుచున్నది. ఆ చరణ శూన్యమగు వచన మెప్పుడును బలుకదగదు. తాల్వాదులగు నుచ్చారణ సాధ నముల వ్యాపారము గలిగిన వెనుక శృతికి వ్యాపారము గలుగు చున్నది. అది లేకున్ననిదియు లేదు. అను నన్వయ వ్యతిరేకము లచే దాల్వాదుల వ్యాపారమున్న శ్రోత్ర వ్యాపారముండును. లేకుండిన లేదు. అట్టి మాదిరిగనే కర్మాచరణ ముండిన బ్రాహ్మ ణ్యముండును. అదిలేకుండిన నిదియు లేకుండును. కావుననే వహ్నియుండిన ధూమ ముండును. లేకుండిన లేదని యన్వయ వ్యతిరేకములచే దెలిసికొను చున్నారు. ఇట్టులే క్రియ యుండిన ఫలముండును. లేకున్న లేదని చెప్పవచ్చును. వ్యాపారము లేకు న్నను వచించు చుండుటయు యుప పన్నమగును. గావున నన్య థా నుపపత్తియులేదు. బ్రాహ్మణత్వాది రూపమగు జాతి పురుష విశేషముల ననుసరించి యుండునని చెప్పుటకు నవకాశములేదు. ప్రత్యక్షముగ ననేక వర్ణములగపడుచుండుటచే నద్దానికి విరు ద్ధము. గోవర్గము నడుమ నశ్వముజేరి యుండునేని విచార సమ ర్థులగు బుధులు దానినశ్వముగా నెఱుంగునట్లు మనుష్య జాతి నుండి శూద్రునికంటే వేఱు విధమగు బ్రాహ్మణత్వ జాత్యాదుల

నెఱుంగజాలరు. అందరు మనుష్యులందునున్న మనుష్యత్వ జాతికంటే విశేషము బ్రాహ్మణత్వ జాతియందు అగుపడుటలేదు. అటులయిన శూద్రులనుండి ద్విజులవేఱు పక్షము విశేషము లెయ్యవి యందురేని వినుడు.

ఆ మనుష్యత్వ జాతి సంస్కారములతోడను క్రియల తోడను గూడి యుండునేని యదియే శూద్రజాతికి దీనికిని వ్యత్యస్తమని చెప్పనగును. యదార్థ్య మెఱుగని మానవులు జీవుడు గూడ బ్రాహ్మణుడనియే కొందరు చెప్పుచున్నారు. కాని వారందరది కారణముగ బ్రాహ్మణత్వ జాతినుండి మిగుల భ్రష్టులై విప్ర సంబంధము కలిగి జనింతురు, ముదుసలి తనము, జన్మాంతర ములు, క్లేశములునను క్రూర నక్రములగు గుంపులచే నావృతమై యాకులమై, మనుష్యులు, తిర్యక్కులు, దుష్టులు, శూద్రులు మొదలగు వారి యోనిసంబంధము వలని దుఃఖములను తరంగ ములును, దుఃస్థితి, రోగము, శోకము, నార్తిగల జనులు నాబడు సుడులుగలదియునై కుక్క, పంది చాండాలురు, కృములు, కూర్మాదులునగు కాయకములు గలిగి నటువంటి సంసారమను ఘోర సముద్రములో మునుగుచు దేలుచు మహాపాప భారముచే నాక్రాంతుడైయుండు జీవుడు బ్రాహ్మణు డెట్టులగును ? అని బ్రహ్మ మఱియు నిట్లనియె.

ఏనుగు, గుఱ్ఱము, గోవు, నజము, నుష్ట్రము, ఖరము మున్నగు వానిలో వాని వాని శక్తి నంగములను వర్ణ ధర్మముల ననుసరించి జాతి భేదము స్ఫుటమై యున్నట్లు భార్గవాదులలో గూడ జాతి నిర్ణయము లక్షణములతో జేయవచ్చును. అట్టిమాదిరి లక్షణము బ్రాహ్మణులయందు లేకుండుటచే మనుష్యులలో

బ్రాహ్మణ్యమను నొకజాతి వేఱు చేయదగదు. పశ్వాదులందువలె నుత్తమ భేదము సిద్ధమగుటకు మనుష్యులలో నవాంతర భేద రూపమగు నిత్యాకృతి (జాతి) కాన్పింపదు "బ్రాహ్మణో శ్వేత వర్ణః" అను ప్రమాణము ననుసరించి తెలుపు మొదలగు రూప ములొక్కొక్కని కసాధారణములై యుండుటంజేసి వాని సంతాన మగు వర్ణభేదము సిద్ధింపనేరదు.

మాంసాశనులును, గాయకులును, ఫలాండులు, శునక భక్షకులును, లేడిపాలను, లొట్టియల పాలను ద్రావువారును, మాంసమును, సమస్త రసవర్గములను, క్షీరములగొనుచు నమ్ము చుండువారును, లేచిపోయి మరలవచ్చి సంస్కృతయగు పున ర్భూవును వృషల యువతిని, జాండాలిని సేవించువారును, శూద్రాన్న రసములతో బెరుగువారును శ్రేతవస్త్రముల ధరించి ప్రేతాన్నము భుజించువారును, మరణాశౌచముగలవారి యొక్కయు సూతికా శౌచముగలవారి యొక్కయు, నన్నపాన ములతో జీవించువారును నగు ద్విజాతులు వేదాధ్యయనము నుండి యజ్ఞాద్యనుష్ఠానము నుండియు, పిత్రుకార్యముల నుండియు, భూతబలుల నుండియు, నాతిథ్యము నుండియు బహిష్కరింపబడు చున్నారు. మాత్సర్యము, మదము, ద్వేషము, తృష్ణ, కామము, నజ్ఞానమునను వానిచే గప్పబడిన దేహచిత్తాదులు గలవారును, హీనాచారులును నితరులగు పిశున మానవులగు ద్విజులును వీరందరును పలు విధములుగ నాశనము నొందు చున్నారు. జాతి భ్రష్టులగు చున్నారు. నియతమగు జాతియుండి నచో నిదియంతయు సరిపడక పోయెడిది. ఇట్లు శాస్త్రోదిత మార్గ భ్రష్టులగు ద్విజులు విశిష్ట గోత్రముల బుట్టినను సంస్కార కలాప

ములచే సంస్కృతులై యున్నను శ్రుతి క్రమము ననుసరించి యధ్యయనముచేసి వేదముల మాణవకుల నధ్యాపనముచేయు చున్నను దురాచార ప్రవర్తకులగుటచే బ్రాహ్మణత్వ ప్రచ్యుతులుగనగు చున్నారు. కావుననొక్క యెడగూడ నిత్యానపాయినియై వస్తు రూపమగుజాతి యొకటి లేదు. నశ్వరముగ నుండుటచేత నది యూహింపరాదు. ఇచ్చట మానవములగు శ్లోకములను దెలిసికొను చున్నారు. మాంస విక్రయమును, లాక్షా విక్రయమును, లవణ విక్రయమును జేయు మానవుడు వెంటనే పతితుడగును. క్షీర విక్రయ మొనరించు బ్రాహ్మణుడు మూడు దినములలో శూద్రుడగును. గోరక్షకులను వాణిజ్యము చేయువారును, కారువృత్తి నుండువారును, గాయకులు, నూడిగము చేయువారును, వడ్డీ వ్యాపారము చేయువారును, బ్రాహ్మణజాత్యుత్పన్నులైనను శూద్రులేయని మనువు వచించెను. ఉత్తమ కర్మలచే శూద్రుడును బ్రాహ్మణత్వము నొందును. నీచ కర్మలచే బ్రాహ్మణుడు శూద్రత్వము గాంచును. ఇట్టులే క్షత్రియుడును విప్రత్వము నొందును. అట్టులే వైశ్యుడును విప్రత గాంచును అని తెలిసికొన వలయును. అని బ్రహ్మదేవుడు చెప్పియున్నాడు. చూచితిరా! బ్రహ్మ దేవుడే యిన్ని విధములచెప్పి యున్నను అద్దాని లెక్కచేయక మొండి తనముగా వాదించు వీరి వాదన తాబట్టిన కుందేటికి మూడేకాళ్లని వాదించు మూర్ఖుని వాదనవలె నుండలేదా ? యీకుచ్ఛిత బ్రువులవాదన ఇంకను కొంత విచారింతము.

ఇదే భవిష్య పురాణము బ్రాహ్మ పర్వము ఏకచత్వారింశాధ్యాయమునందు బ్రహ్మదేవుడు చెప్పిన విషయము మీకెరుక జేయుచున్నాడను గమనింపుడు.

(......... మఱియు ద్విచత్వారింశాధ్యాయనము నందు చెప్పబడిన విషయమును చూడుడు) ...... దుశ్చారిత్రముగల మానవుడు నిర్వికల్పముగ బ్రాహ్మణత్వము నుండి చ్యుతుడగును. దురనుష్ఠాన పరులగు పురుషులకు దురనుష్ఠాన బలముననే పతనము గలుగుచున్నది. కావున బ్రాహ్మణ్యము నుండి నిశ్చయముగ విముక్తుడగును. పురుష పుంగవులెందైన నీ విషయము నీక్షించి యున్నారా ? స్పర్థయున్నంత మాత్రమున నీ యత్న యము యుక్తమా? అప్పుడదృష్టమునందఱకు దుల్యముగజేయ నుత్సహింతువా? చెప్పుము. సదాచారము ననుష్టించు వ్యాసాది మహ మునులు గర్భాదానాది సంస్కార కలాపములు లేనివారేకదా ! (శూద్రతుల్యులు) కొందరు సర్వలోక సమస్కృతులై లక్ష్మీ సంపన్నులై విప్రోత్తములై చాలామందిచే గీర్తింపబడు చున్నారు. వారిని దెలిసికొనుడు. మహనీయుడగు వ్యాసుడు కైవర్తి (పల్లె జాతి బెస్త) కి జనించెను. పరాశరుడు కుక్క మాంసము వండు మాల (శ్వపాకాశ్చ పరాశరః దానికి జనించెను. శుకయోగి చిలుకకు జనించెను. కణాదముని గ్రుడ్లగూబకు సుతుడయ్యెను. ఋష్యశృంగుడు మృగీ గర్భమున జనించెను వసిష్ఠుడు వేశ్యా పుత్రుడయ్యెను. మందపాలుడను ముని శ్రేష్ఠుడు పడవ నడుపు దాని పుత్రుడయ్యెను. (లావుకయని పాఠాంతరము పక్షి విశేషము వలన బుట్టెను) మాండవ్యుడను మునిరాజు కప్ప యందు జనించెను. ఇంకను బెక్కురు వెనుక జెప్పిన చొప్పున విప్రత్వమును బొందియున్నారు. ఈ వచనము రమ్యమగు చరిత్రములచే నర్పింపదగి యున్నది. దీనినంత నాలోచించి యుత్తమాచారము జేయువాడు నాయాచారముచే నభివృద్ధి బొందిన తేజము గలిగి యుండును.

మునులారా! వేదాధ్యయనముకూడ బ్రాహ్మణ్యమునే బొందు చున్నది విప్రుని వలెనే రాజన్యులను వైశ్యులను గూడ బొందుచున్నది. రాక్షసులును, శునకభక్షులును, చాండాలురును, వేటకాండ్రు, గొల్లలు, పల్లెవాండ్రు నితరులగు వృషలులు మొదలగు నధములెల్లరును గూడ వేదముల నధ్యయనము జేయుచున్నారు. శూద్రులు దేశాంతరములకేగి విప్రత్వ్యలముగు వ్యాపారము నాకారము భాషణము మొదలగు వానిని గల్పించి బ్రాహ్మణత్వమునో, క్షత్రియత్వమునో యాశ్రయించి సర్వవేదములగాని రెండు వేదములగాని యొక్క వేదముగాని యథాక్రమముగ నధ్యయించి శుద్ధ బ్రాహ్మణ జాతి యందుద్భవమంది శుభలక్షణ సంపన్నయగు కన్యనుద్వాహము జేసుకొనుచున్నారు. అటుకాదేని వారు క్షత్రియ వైశ్యులలో జేరి వేదములునేర్చి గౌడ బ్రాహ్మణులని గాని, దాక్షిణాత్యులని గాని జాతిని నిర్మించుకొనుచున్నారు. శూద్రత్వము తెలియక యుండుటచే నిచ్చాను సారముగ బ్రాహ్మణత్వము నొందుచున్నారు. కావున వేదాధ్యయన క్రియా కృతమగు బ్రాహ్మణత్వమునకు లక్షణము దుర్లభము అనిచెప్పి యున్నాడు. యిచ్చట నొక విశేషముగూడ గన్పట్టుచున్నది. ఏమన నానా భిన్నజాతి వారు అంత్యజాతివారు కూడ నధ్యయనముచేసి కాబడిన బ్రాహ్మణ శ్రేణికి చెందినవారే గౌడ బ్రాహ్మణులను వారును, దాక్షిణాత్యులను వారును అయివున్నట్లు తెలియుచున్నది. (........ "శూద్రుల కధ్యయనాది ప్రసంగము నివారింప శక్యముకాదు" ఇతిహాసముల యందిట్లుండ వేదాధికారము నాకొక్కనికేయని వాదించుట మూర్ఖ లక్షణముకాదా ?

హరిణీ గర్భమున బుట్టిన ఋష్యశృంగుడను మునీంద్రుడు తపస్సుచేత బ్రాహ్మణుడాయెను. కావున సంస్కారమే బ్రాహ్మణత్వమునకు గారణము. శ్వపాకీగర్భ సంభూతుడును వ్యాసుని తండ్రియునగు పరాశరుడు తపముచే బ్రాహ్మణుడయ్యెను. కాన సంస్కారమే బ్రాహ్మణత్వమునకు గారణము. ఉలూకీగర్భ సంభవుడగు కణాదుడను ముని తపస్సుచే బ్రాహ్మణుడయ్యెను. వేశ్యాగర్భ సంభవుడగు వసిష్ఠుడు తపస్సుచే బ్రాహ్మణుడయ్యెను. నావికాగర్భ సంభూతుడగు మందపాల ముని తపస్సుచే బ్రాహ్మణుడయ్యెను. అందుచే సంస్కారమే కారణము. వేదముల చేతను, శాస్త్రములచేతను నుత్పన్నములైన సంస్కార కలాపములందు నిపుణులగు వారును విద్యా తపోధన బలముచే నుత్కృష్టఫలమును గాంచు చున్నారు. దేహసంస్కారములన్నియు గలిగియున్నను మనుజులు మహాపాతకులై యున్నచో వారినుండి బ్రాహ్మణత్వము తొలగిపోవు చున్నది. కావున బ్రాహ్మణ్య మనునది సాంకేతికముగాని యనాదియై నిత్యముకాదు అని విద్వాంసులు తెలిసికొను చున్నారు. అహా! చూచితిరా! బ్రహ్మదేవుడు యెంత నిష్పాక్షికముగజెప్పి యున్నాడో కుక్కలకు, నక్కలకు, కప్పలకు, ఉప్పలకు పుట్టినవారేగాక మాల లు మొదలు శూద్రుల వఱకుగల జాతులలో పుట్టినవారు సైతము సత్యాచరణచేత బ్రాహ్మణులై నట్లును బ్రాహ్మణుడంటె నొసట చిహ్నము పెట్టుకొని పుట్టినవారు కారనియు చెప్పుచుండ యీ వేషదారులు మేమె బ్రాహ్మణులమని వాదించుటయు అగ్ర తాంబూలము అగ్ర పూజలు కావలయునని వాదించుట అర్థ రహితమని యిప్పటకైన బుద్ధిమంతులు గ్రహింతురు గాక.

పాఠకులారా! యెంతయో ముఖ్యమైన యీ విషయమును న్యాయదృష్టితో పరిశీలించి యధార్థమును తెలుప గలందులకై మరికొన్ని దృష్టాంతరములను జూపుచున్నాడను. ఓపికతో చదువు టకుగా విజ్ఞప్తిచేయు చున్నాడను. ఎట్టివాడు బ్రాహ్మణుడు అను విషయమును మాత్రము పరిశీలించుడు. భవిష్య మహాపురాణము నందు చత్వారింశాధ్యాయము నందు చెప్పబడి యుండిన దానిని గమనింపుడు. నాస్తికులును, వేదముల నిందించువారును, గ్రామ మునకు యాజకులును (ఋత్విక్కులు) గ్రంథము తెలియంగని వారును, పెక్కుదోషములు గలవారును......... ధూర్తులును, నటులును (నాట్యము చేయువారును) నన్ని వస్తువులు విక్ర యించువారును (వ్యాపారముచేయువారు) దుష్టములగు వాక్కాయ మనోవ్యాపారములచే దిరస్కృతులైనవారును నగు బ్రాహ్మ ణాధములు నూరులకొలది యజ్ఞములనుష్టించినను నీలోకమున సిద్ధి బొందనేరరు. జన్మ స్వభావములచేతనే శూద్రులకే యనిష్ఠ ములు గలుగునో యవియన్నియు నిరాటంకముగ బ్రాహ్మణులకు కూడనున్నవి కదా! కావున మంత్రముగాని, యగ్ని హోత్రముగాని యజ్ఞ వేదికపై పశువుల వధించుటగాని బ్రాహ్మణత్వమునందు హేతువులు గాజాలవు. తెలిసినదా! కొందరు బాడబులు యజ్ఞ ములు చేసినామనియు అందుచే సోమిదేవి సోమయాజుల మైతి మని చెప్పుచుందురు. పశుహింస యుతమైనది యజ్ఞము. బ్రహ్మ కర్మ లేక బ్రాహ్మణ కర్మకాదని బ్రహ్మదేవుడు చెప్పుచున్నాడు. యిందుచేతనే భాగవతమునందును.

కం॥ పశువుల బొరిగొని మఖములు
విశదముగజేయు బుధుని వీక్షించితగన్
విశసనము సేయునోయని
క్రశిమిన్ బెగడొందు భూతగణము నరేంద్రా॥

సప్తమ స్కంధము 456 వ పద్యం॥ భవిష్యపురాణమున ....... "బ్రాహ్మణుడు మైథునమునకై యనురాగముగల శూద్ర స్త్రీని (యువతిని) ప్రేమించు చున్నాడు. అదియు మదన సంతాప నాశకమగు సంగమము గలిగిన తోడనే గర్భము దాల్చుచున్నది. కామాతురులై యున్నచో బ్రాహ్మణ స్త్రీలైనను శూద్ర పురుషులను గూడ మైథునమునకై యధికముగ నపేక్షించు చున్నారు. ఆద శూద్రులు నా యువతులకు గాను సుఖముల నొసంగు చున్నారు. ఇది అభిన్న జాతీయులగు మానవులలోని వృత్తాంతము. ఇక భిన్న భిన్నజాతులగు గోవులు, గుఱ్ఱములు, నొంటెలు, నేనుంగులు మొద లగు పశువులన్నో సుఖాపేక్షయున్నను విజాతీయములగు జంతు వులయందు గర్భము దాల్చుటలేదు. ఆబోతులు గోవులను కామ ముచే సంగమముచేత నింపు చున్నవి. గుఱ్ఱములును గుఱ్ఱము లందే తెన్నగ రతిజేయు చున్నవి. ఆడ యేనుగు గున్న భర్తయగు మగ యేనుగు గున్ననే జేరి మోదముతోరమించు చున్నది. తిర్య గ్జంతువులు మనుష్య స్త్రీలతో మైథున మొనరించినను దానియందు గర్భము గలిగించుటలెదు సుఖమును గలిగించుటలేదు. మను జాంగనయేకోరి తిర్యగ్జాతి పురుషునితో మైథున మొనరించినను దాని వలన గర్భము దాల్చుటలేదు. ఆ రెండు తెగలకును మైథు నము యుక్తముగాదు. ఇట్టివిభాగము మనుష్య స్త్రీ పురుషులకు మైథున విషయమై యొక్కింతయేనియు భేదము గానరాదు.

అట్టి విభాగముండినచో ద్విజశూద్రులకు భేదము స్పష్టము గ తెలిసి యుండును. ఈ భేదము వేదపాఠము వలని కపటముచే గలిగినది కాని క్రియా జనితముగాదు. ఒక సామాన్య స్థానమున బెక్కు జడ సంఘములచే నీపక్కగ నిర్మింపబడెను."......... కావున జాత్యాది నిర్మాణము సత్యేతర మూలకముగాని తథ్యము గాదు. ఇవి బ్రహ్మదేవునిచే జెప్పబడిన మాటలు. ఇప్పటికైనా శ్రద్ధవహించి జాత్యహంకారులగు బాడబులు వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్‌వారి కంపెని నుండి శ్రీ భవిష్య పురాణము బ్రాహ్మ పర్వము" అను గ్రంథమును తెప్పించుకొని లేక తెచ్చు కొని అందులో 282 వ పుటనుండి 312 వ పుట వరకు చదువు కొని తమ శఠత్వము వదలిన బాగుండునని తెలియజేయు చున్నాడను.

ఇచట యజ్ఞ విషయమున శ్రీ యోగి వేమనగారు చెప్పిన పద్యముల కొన్నిటిని ఉదాహరణకు జూపించు చున్నాడను.

ఆ॥ వె॥ లంజ పొందు గోరి లంజల కొడుకులు
యజ్ఞములను జేతు రవనియందు
యజ్ఞమనగ జీవహింస జేయుటగద ॥విశ్వ॥

ఆ॥ వె॥ తండ్రి మఖముచేసి తనర రంభనుగూడె।
తనయు డట్లుచేయ తల్లి గాదె!
తల్లిని రమియించు దబ్బర విప్రులు ॥విశ్వ॥

ఆ॥ వె॥ హింస జేయకుండ యేముఖ్య ధర్మంబు।
వెనుక జంపుదురట విప్రవరులు।
చావు పశువుది నెడి చండాలుడె మేలు ॥విశ్వ॥

ఆ॥ పేరు సోమయాజి పెనుసింహ బలుడయా।
మేకపోతు బట్టి మెడలు విరచు।
గాని క్రతువు జేయ గలుగునా మోక్షంబు ॥విశ్వ॥

ఆ॥ సోమయాజి ననుచు సొంపుతో వేషంబు।
కట్టి మాంసమెల్ల గాల్చి తినును।
ద్విజుడనేననగను నదికమేమిటి వల్ల ॥విశ్వ॥

సోదరులారా! యజ్ఞ విషయమును గురించి వేమనగారు చెప్పిన పద్యములను విన్నారు గదా. ఇక ద్విజ, విప్రశబ్దములను గురించి కొంతదెలిసి కొందము- ముందు చెప్పబడిన ఋష్యాదులకు ద్విజులనియు, విప్రులనియు పేరు కలుగుటకు కారణము లేకపోలేదు. ఏట్లన వసిష్ఠుడు బ్రహ్మకును వేశ్యకును అనగా రెండు జాతులకు పుట్టినందుచేత ద్విజుడని ఆ మునికి పేరు వచ్చినది. వ్యాసుడు కుక్క మాంసముదిను మాలదానికి బుట్టిన పరాశరునకును కైవర్తి పల్లెజాతియగు కన్యకును పుట్టిన కారణమున అతనికి ద్విజుడును నామము కలిగినది. ఇట్లే తక్కనవారికి కూడ "ద్వి" రెండు "జ" పుట్టబడిన అనగా రెండు జాతులను పేరు బెట్టుకొనిన వారికి బుట్టిన కారణముననే ద్విజుల ను నామము కలిగినదనియు అట్టివారు నిరంతరమును సద్గతి జెందుటకుగాను వేదములు చదువుటచే "వేదపాఠంతు విప్రాణాం" అను ప్రమాణము ననుసరించి విప్రులైరనియు పేరు వచ్చినది గాని వాస్తవికమైన వకజాతి మాత్రముకాదని పైవిషయములంబట్టి దెలిసి కొందురు గాక.

పాఠక మహాశయులారా ! "వ్యాసో నారాయణోహరిః" యని మహాఘనమైన పేరుగాంచిన వ్యాసమహర్షి పుట్టుక యంతటి నింద్యమైనదో చూచితిరా! ఈ వ్యాసులవారే పదునెనిమిది పురాణములు వ్రాసినాడని ప్రతీతి. శక్తి మునికిని స్వపచాత్మ అనే మాల స్త్రీకిని జన్మించినవారే "కలౌపారాశరస్మృతిః" యని కలియుగమునకు ధర్మశాస్త్రము వ్రాసినట్టి పారాశరమునియే కామోద్రేకుడై శాస్త్ర నిషిద్ధమనికూడ దలంచక పట్ట పగటి వేళనె పల్లెపడుచు అగు నావనడుపు దానిని మోహించ అందులకా పడుచు అంగీకరించక ఎన్నోవిధముల నీతిచెప్పినను వినకను మఱియు పగలు రతిచేయుట నింద్యము కదా! యనియు సామాన్య స్త్రీ బుద్ధి చెప్పినను వినక పగలునే చీకటిగామార్చి యా మత్స్యగంధిని పడవలోనే రమించిన సద్యోజాత గర్భమునందు వ్యాసుని గనియెనట. ఆంధ్రభారతము ఆది పర్వము తృతీయాశ్వాసము నందు 35 వ పద్యము నుండి 44 వరకు చదువండి. పూర్తి వివరములు తెలియగలవు. మరియు కొన్ని ఉదాహరణలతో ఋషుల యొక్క జీవిత విశేషములు దెల్పుచున్నాడను: పక్షపాత రహితులై పరిశీలించకోరెద. "సత్యం దానం క్షమాశీల మా నృ శం స్సం త పోదృణా, దృశ్యంతేయత్ర నాగేంద్ర సబ్రాహ్మణ ఇతిస్మృతః" "శూద్రేయద్భవే లక్షణం ద్విజేతేత్సవ విద్యతేనవై శూద్రోభవేన్నాశ్ఛూద్రో బ్రాహ్మణో నచ బ్రాహ్మణః భారతం వనపర్వము 180 ఆంధ్రభారతం 152 వ పేజి.

సత్యము, దానము, క్షమము: శీలము, అబద్ధమాడ కుండుట, తపము నాచరించుట, పాపమునకు దూరముండుట ఇట్టి గుణములు నెవని యందుండునో అట్టివాడె బ్రాహ్మణుడు. యీ లక్షణ

ములు శూద్రుని యందున్నను అతడు బ్రాహ్మణుడే యగును. బ్రాహ్మణుడను వానియందీ గుణములు లేకపోయిన అతడు శూద్రుడే యగును. ఇదే విషయము ఆంధ్రభారత అరణ్య పర్వమునందు 127 పద్యమునుండి యున్న విషయము పరిశీలింతము.

ఆ॥ ఘనుడయే గుణములు గలవాడు బ్రాహ్మణుం
డతని కెరుగదగిన యట్టి వస్తు
వెద్ది దీనినాకు నెరిగింపుమనిన ని
ట్లనియె జెప్పెబాండ వాగ్రజుండు॥ 127




సీ॥ సత్య క్షమాదమ శౌచదయాతపో
దానశీలంబు లెందేని గాన
నగునట్టివాడు బ్రాహ్మణుడగు సుఖము దుః
ఖంబునై నెడ విమోహమును బొంద
ఈ నికియు వానికి నుత్తమంబగు వేద్య
మనిన నీచెప్పిన యగ్గుణములు
క్రియ శూద్రునందు గల్గిన నతండుత్తమ
ద్విజుడుగా నేర్పునే నిజము విడచి (152 పేజి)

"శూద్రోప్యాగమ సంపన్నో ద్విజో భవంతి సంస్కృతః"

(బ్రహ్మ పురాణము 222—53—54)

ఇందులోకూడ పైఅర్థమునే చెప్పియున్నారు. ఇంతవరకు చూపెట్టిన ప్రమాణములబట్టి బ్రాహ్మణ్యమునకు జన్మకారణము కాదనియు వృత్తి, సంసారములే కారణములనియు రూఢియైనది గదా! ఇంకను కొంత పరిశీలించుదము.

ఈ బ్రాహ్మణులను తెగవారొకప్పుడు బోయలని పిలువ బడుచున్నట్లుకూడ తెలియుచున్నది. చూడుడు చాగంటి శేషయ్య గారిచే రచింపబడిన ఆంధ్ర కవితరంగిణి. మొదటి సంపుటము 81 వ పుటనందు వ్రాయుబడిన విషయము. ("ఇంద్రభట్టారకుడు ..........ఇతడు భారద్వాజ గోత్రుడును, ఇజ్జిలూరు బోయ యను నామాంతరముగల దుగ్గశర్మ పౌత్రుడునగు చెండి శర్మకు కొంత నాగూరను గ్రామమును దానమిచ్చి నట్లొక తామ్రశాసన మున్నది. (1811—12 సం॥ నెం 2 రు) బోయ శబ్దము భోగిక శబ్దమునుండి వచ్చినది "బోయ" "బోయలు" అని యా కాల మున బ్రాహ్మణులు పిలువబడు చున్నట్లు శాసనములున్నవి. ఈ కొండ నాగూరు కృష్ణా మండలములోని నూజివీడు తా॥లో నున్న ముదనూరు ప్రాంతమున యున్నట్లు తలంపబడు చున్నది ") అని వ్రాయుబడివున్నది. మరియు నొక్క విషయము గమ నించుడు. ఇక్కాలంబున బ్రాహ్మణులమని చెప్పుకొనువారి పూర్వులు గొల్లలు మొదలగు శూద్రులతోడ దుల్యులైనట్లు బ్రహ్మశ్రీ జయంతి రామయ్య పంతులుగారిచే వ్రాయబడిన యీ క్రింది విషయము స్పష్టముగ బోధించుచున్నది. "సర్వలోకా శ్రయుని చెందలూరి శాసనములో దానప్రతిగ్రహీతలగు బ్రాహ్మ ణుల పేర్కొను సందర్భమున" "పంగ్రి బోయాయ, కోళ్లపుత్రో బోయాయ, పిదెన బోయాయ, కులియిద బోయాయ" అని యీ ప్రకారము బోయ శబ్దము బ్రాహ్మణులకు వినియోగింప బడినది. ఇక్కాలమున బోయడను బిరుదము బోయకులము. వాల్మీక కులము వారికిని, గొల్లలు, యాదవులను వారికిని జెల్లుచున్నది." (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ప్రాచీనాంధ్ర భాషా స్వరూపము

పుట 155) యీ శబ్దములు వీరికి సాంప్రదాయకములే యైనట్లు గూడ కనబడుచున్నది. ఎట్లన వాల్మీక సంతతివారికి యీ శబ్దము పర్యాయమైనట్లు తెలియవచ్చు చున్నది. ఇట్లనే మరికొందరికి కూడ పాపరాజు, గోపరాజు అను రాజశబ్దములచే పిలువబడు చుండుటకు కూడ కారణములేక పోలేదు "పురాక్షత్రియ వర్గేతు వినాశం భార్గవద్గతే, తత్కన్యకాసు సంభూత విప్రభ్యశ్చని యోగినమః" పూర్వము పరశురామునిచే రాజులందరు వధింప బడి పోగా యవ్వనవంతులును కామోద్రేకులగు క్షత్రియ స్త్రీలు కొందరు తమకు భర్త లెట్లని అడిగినందున పరశురాముడు వారికిగా తనకులము వారిని కొందరిని నియోగించగా అట్టివారికి కలిగిన సంతానమునకే నియోగులనియు రాచకన్నియల కుద్భవమైన కారణముగ వారి నామముల చివర గోపరాజు. పాపరాజు, ఐతంరాజు, బద్దిరాజు మొదలగు రాజశబ్దముల ధరించినట్లును చెప్పు కొనుచున్నారు. అంతేగాదు "భట్టినీమ యధామాతా విదితాసుత వైదికః॥ అత ఏవహితే ప్రాంచభట్టు శబ్ద ప్రదాసదా" భట్టు వని తను విప్రుడు అంగీకరించగా పుట్టిన సంతానమునకే వైదికు లనియు వారి నామముల చివర రాంభట్టు, అనంతభట్టు, అప్పంభట్టు, ఇత్యాదిభట్టు శబ్దములు తగిలించు కొన్నట్లును తెలియు చున్నది. (శబ్దార్థ చంద్రికయందును భట్టాచారి. స,వి, అర్చకుడు నంబి, భట్టిని, స. వి. బ్రాహ్మణుని పెండ్లాము, భట్టు, సం, వి. భట్టువాడు, రూ, భట్రాజు భట్టుండు, స. వి. బట్టువాడు.,) యీవిధముగ పైఅభిప్రాయమున కనుగుణముగనే వ్రాయబడి వున్నది. మైసూరు తిర్పు.

ఇకవీరి ఆహార విషయమును గురించి కొంత పరిశీలింతము. యీ బ్రాహ్మణ నామధారులు ద్విజులని పిలువబడు చుండుట అందరెఱింగినదియే. మఱియు ద్విజుడనగా బాపడు, క్షత్రియుడు, వైశ్యుడు యీ ముగ్గురకును అన్వయించు చున్నను వీరు మువ్వురు సమానముగ నుండుటలేదు. ఒకరి కొకరితో సంబంధ బాంధవ్యములు లేవు. ఈ ద్విజాతి వర్గములోనే చంద్రుడు, గరుత్మంతుడు, శేషుడు అను మూడు పేర్లను చేరి వున్నవి వీటి మూటికి మాంసభక్షణము నిత్యానుసరణమైయున్న ట్లును తెలియుచున్నది. ద్విజరాజు చంద్రుడు. "ద్విజరాజశ్శ శధరోన క్షత్రేశక్ష పాకరః" (అమరం) యీ చంద్రుడు తురకల దేవుడనికూడ వారు చెప్పుకొను చుందురు. వారు చెప్పుకొనడమే కాదు. మను చరిత్రకారుడు కూడ మను చరిత్ర తృతీయాశ్వాస మునందు 42 వ పద్యమునందు

కం॥ గోవధము సేయు తురకల
దైవంబవనీవు మొదల దక్కకపాంథ
స్త్రీ వధముసే యరో యుదె
నీ వర్తనమేమి చెప్పు నీరజవైరి॥

అని వ్రాసినవాడు కూడ ద్విజ జన్ముడేకదా! గనుక గోవధ జేయునట్టి తురకలును, గోమేధము, నరమేధము, అశ్వమేధము. మేకమేధము అను యజ్ఞములపేరిట మాంస భక్షణముచేయు, ద్విజులును సమానులురై యున్నట్లుకూడ దెలియుచున్నది యిప్పటికిగూడ యీ బాడబులు యజ్ఞములపేరట మేకపోతుల జంపి భక్షించు చుండుట అందరు జూచుచునే యున్నారు. అందులకే వేమ యోగంద్రు డిట్లు జెప్పియున్నారు.

పేరు సోమయాజి పెనుసింహ బలుడాయె
మేకపోతు బట్టి మెడలు విరుచు
క్రతువు చేయ ఫలము కామంబుకే గద  ॥విశ్వ॥

"అహింసా పరమోధర్మ యనెడి వేదోక్తికి విరుద్ధముగా అనేకులురు అనేక గ్రంథములయందు నింద్యముగా వ్రాయబడిన జీవహింసతో కూడిన కర్మను వేదముల పేరిట, వేద ధర్మముల పేరిట, యజ్ఞమను పేరిట మాంస భక్షణము జేయుటలో మహమ్మదీయులకు వీరికి గల వ్యత్యాసమేమిటో బుద్ధిమంతు లూహింపుడు. ఇంతేగాదు ఈ బకధ్యాన పరాయణులు, మొదటి నుండియు మాంస భక్షకులుగై యుండినట్లుగూడ వీరి కనుకూలముగ వ్రాసుకోబడిన మను ధర్మశాస్త్రమునందును లిఖింపబడి యున్నది వీరు దైవ కార్యములగు యజ్ఞ కార్యములందే గాక పితృ కార్యములందు కూడ నానా విధములగు పక్షి, మృగ: మాంసము లుపయోగించుకొను చున్నట్లు మనుస్మృతి (మను ధర్మ శాస్త్రము) తృతీ యాధ్యాయమునందు 268-269-270-271 272 శ్లోకములయందు నుండు విషయము నుబట్టి రుజువగు చున్నది. మరియొక మాటజెప్పి అవల పైశ్లోకముల వివరింతును. శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు తాము రచించిన ఆంధ్రుల చరిత్రయందు "మరియు బూర్వము బ్రాహ్మణు లందరు తురకలవలెనే మాంసభక్షకులై యుండిరి." అని స్పష్టముగ వ్రాసియుండడమే గాక ఈనాటికిని బంగాళా దేశము. మత్స్యదేశమునందలి బాపలు మత్స్య మాంసాదులను భక్షించు చుండుట ప్రత్యక్షముగ అందరికిం దెలిసినదియే కదా! ఇక మను ధర్మశాస్త్రమును దిలకింతము.

6)

"ద్వౌమాసౌ మత్స్యమాంసేన త్రీన్ మాసాన్ హారిణేనతు।
ఔరభ్రేణాథ చతురః శాకునేనాథ పంచవై॥ 268

తా॥ మత్స్యమాంస దానముచే రెండు నెలలును, జింక మాంస దానముచే మూడు నెలలును, గొఱ్ఱెమాంస దానముచేత నాలుగు నెలలును, ద్విజులు భక్షింపదగిన పక్షుల మాంసముచే నైదు మాసములును

"షణ్మాసాంశ్ఛాగ మాంసేన పార్షతే నచ సప్తవై।
అష్టా వేణస్యమాంసేన రౌరవేణనవై వతు॥ 269

మేక మాంసముచే నాఱు మాసములును, చారల జింక మాంసముచే నేడు మాసములును, కృష్ణ మృగ మాంసముచే నెనిమిది మాసములును, దుప్పి మాంసముచే దొమ్మిది మాసములును.

"దశ మాసాంస్తు తృప్యంతి వరాహ మహిషామిషైః।
శశకూర్మయోస్తు మాంసేన మాసా నేకాదశై వతు॥ 270

ముండ్లపంది, అడవి దున్న వీని మాంసముచే బది మాసంబులును, కుందేలు, తాఁబేలు వీని మాంసముచే బదునొకండు మాసములును

"సంవత్సరంతు గవ్యేన పయసా పాయసేనచ।
వార్ధ్రీణసస్య మాంసేన తృప్తిర్ద్వాదశ వార్షికీ॥ 271

గోవు సంబంధమైన పాలు, పెరుగు, నెయ్యి వీనితోను శ్రాద్ధ మొనర్చిన యడల నొక సంవత్సర కాలమును వార్ధ్రీణ మను ముసలి మేకపోతు మాంసముచే శ్రాద్ధ మొనర్చిన పం డ్రెండు సంవత్సరముల కాలమును పితరులు తృప్తి నొందుదురు. (వార్ధ్రీణ మనగా "త్రిపి బంత్వింద్రియ క్షీణం శ్వేతం వృద్ధ మజా

పతిం, వార్ధ్రీణ సంతుతం ప్రాహు ర్యాజ్ఞికాః పిత్ర్య కర్మ, ణీతి. నద్యాం దౌపయః పిబతో యస్యత్రీణి జలం స్పృశంతి కర్ణౌజి హ్వాచ. త్రిభిః పిబతీతి త్రిపిబః" నదిలో నీరు త్రాగునపుడు జిహ్వతోపాటు రెండు చెవులును నీటిలో తాకునట్లుగా క్షీణింద్రియ ములుగల తెల్లని ముసలి మేకపోతు అని అర్థము.)

"కాలశాకం మహా శల్కాః ఖడ్గలోహ మిషం మధుః
అనంత్యాయైవ కల్పంతే మున్య న్నానిచ సర్వశః॥ 272

కాలశాకమను శాకమును, ముండ్లుగల చేపలు, ఖడ్గ మృగము, ఎఱ్ఱని పొట్టేలు వీని మాంసమును నెవ్వారి ధాన్యమును, తేనెయు మున్యన్నములు వీనితో శ్రాద్ధ మొనర్చిన పితరులు తుది లేనంత కాలము తృప్తి నొందుదురు.

పాఠకులారా! గమనించితిరా. యీ ద్విజులనబడు బ్రాహ్మ ణులు తమ పిత్రు దేవతల నుద్దేశించి చేయబడు పిత్రు కార్యము లందు ఉపయోగించవలసిన పై మాంసాదులు ఆడవి జాతుల వారికి తప్ప యితరులకెట్లు లభించును. యీ విషయమును సూక్ష్మ బుద్ధితో పరిశీలించిన వీరందరును మొదట ఆడవి జాతుల వారని తెలియకపోదు. వీరిట్లు దైవకార్యములందేగాక పిత్రు కార్యములందు కూడ నానా విధములగు మాంస భక్షకులరై యుండినట్లు ఋజువైనది గదా! యీ విషయమును గురించి పురాణ విషయములను కూడా చూతము. ఆంధ్ర విష్ణు పురా ణము చతుర్థా శ్వాసమునందు 271 వ పద్యమునందు.

కం॥ సారంగము మను బోతును
సైరిభమును గొఱియ దుప్పి శశమున కులమున్
వారి చరంబును మేఁకయు
నారయఁబల పైతృకమున కర్హమగుఁజుమీ॥

ఇట్టి మనుబోతు మగ ఋష్య మృగము) కారెను బోతు, గొఱ్ఱె, దుప్పి, కుందేలు ముంగిస, చేప, మేక ఇవియన్నియు పితృకర్మమునకు అర్హములగునని చెప్పబడినది. మరియు మార్కండేయ పురాణమునందు తృతీ యాశ్వాసమున

కం॥ వినుతగుణ! హవిష్యాన్నం
బున నొకనెల మత్స్య మాంసమున రెండునెలల్
విను లేడి మాంసమునఁ బిత
లొనరగ మూన్నెలలు దృప్తి నొందుదురుగడున్॥ 199॥
తె॥ శశము పిశితంబు పక్షిమాంసంబు పంది
యామిషము వేఁటపలలంబు నధికమైన
తృప్తి యొనరించునొగిఁ బితృ దేవతలకు
నెలమి నాలుగునేను నాఱేడు నెలలు॥ 200

వ॥ ఇట్టి మాంసం బష్ట మాసంబులు దుప్పి మాంసంబు నవ మాసంబులు గురుపోతు మాంసంబు దశ మాసంబులు తగురు మాంసం బేకాదశ మాసంబులు గోవు పాలును బాయసంబును బండ్రెండు మాసంబులు పితృ దేవతలకుఁ దృప్తి యొనరించు మఱియుం గాల శాకంబును దేనియయుఁగయా శ్రాద్ధంబును వారికి ననంతకాల తృప్తి వహించు" నని చెప్పబడియున్నది. దైవపితృ కార్యములందే గాక నిరంతరము గాకపోయిన బుద్ధిపుట్టి నపుడెల్లను మాంసమును భుజించు చున్నట్లు కూడ తెలియుచున్నది.

"శయానః ప్రౌఢపాదశ్చ కృత్వాచైవావ సక్థికామ్।
నాధీయీతా మిషం జగ్ధ్వాసూత కాన్నాద్యమే వచ॥
మనుస్మృతి 4 వ అధ్యాయం 112 వ శ్లోకం॥

పాన్పుపై బరుండియు, ఎత్తు పీఠముపై గాళ్లు చాచుకొనియు, నడుమునకు మోఁకాళ్లకు బట్ట కట్టుకొనియు, మాంసము భుజించియు, జాతాశౌచ, మృతాశౌచాదులు గలవారి యన్నముదినియు వేదముఁ బఠింపరాదు.

"మధ్యందినేఽర్ధ రాత్రేచ శ్రాద్ధం భుక్త్వాచసామిషమ్।
సంధ్యయో రుభయోశ్చైవన సేవేత చతుష్పథమ్॥ 131

మిట్ట మధ్యాహ్నమునను, నడురాత్రి యందును, మాంసముతోడ శ్రాద్ధ భోజనముచేసియు, ప్రాతస్సాయం సంధ్యా కాలములందును, నాలుగు దారులు గలియుచోటను బహుకాల ముండరాదు. యీ దృష్టాంతరములనుబట్టి వీరు మొదటి నుండియు మాంసభక్షకులై యుండినట్లు తెలియుచున్నది. గనుకనే ద్విజరాజ శబ్దములో చంద్రుని, గరుత్మంతుని, సర్పమును (శేషుని) చేర్చియుండుటచే గరుత్మంతునికి, సర్పమునకుగూడ మాంస భక్షణము విధియై యున్నది. మరియు కొమర్రాజు లక్ష్మణరావు పంతులు బి. ఎ. గారు వ్రాసిన హిందూదేశ కథా సంగ్రహమను గ్రంథములో ౨ వ ప్రకరణము 32 వ పేజిలో "యువలు, గోధుమలును అప్పటి ముఖ్యాహార ధాన్యములు వరిపంట యప్పుడు లేదు. అప్పటివారు మాంసమును నిరాటంకముగ భుజించుచుండి"రని కూడ వ్రాసియున్నారు. యింకను అనేకమంది యీ నామధారుల మూల పురుషులును, గోత్రరుషులును, అయిన ఋషులు మాంసము దినుచుండినట్లు పురాణాదులయందు కూడ

గాన్పించుచున్నది. విప్రుడైన అగస్త్యుడు జింక మాంసముతో నిత్య శ్రాద్ధము చేయుచుండినట్లు భారతాది పర్వమునందు వ్రాయబడి యున్నది.

మఱియు భారతారణ్య పర్వ ద్వితీ యాశ్వాసమునందు "తన తమ్ము గామరూపధరు వాతాపి నపుడు మేష రూపంబుచేసి వధియించి వాని మాంసం బిమ్ముగా వండించి దాని నా విప్రునకు గుడువం బెట్టించి

తే॥ విప్రు కడుపులోనున్న యవ్వీరు ననుజుఁ
బిలిచెరమ్మని వాతాపి ప్రియముతోడ
జీవితుండయి వాఁడు సెచ్చెరను విప్రు
కడుపు వ్రచ్చుచు వెలువడి క్రాఁచె విప్రు॥ 323

"అది మొదలుగా నిల్వలుండు దనకడకు నతిథులై వచ్చు విప్రుల నిప్పాటనంతకు పురంబున కతిథులంజేయు చున్నంత." యని యుండుటంబట్టి విప్రులకు మాంస భక్షంబు విధికృతంబు గాయుండుటయే గాక యానాడందరి యిండ్లయందును మాంసమును భక్షణజేయు చుండినట్లు గూడ రుజువగుచున్నది. మరియు అగస్త్యుడు మాంస భక్షణముజేసినట్లు అదే భారతమునందు యిల్వలవాతాపి కథలో వ్రాయబడి యున్నది బ్రాహ్మణుండు మాంసంబు పెట్టమని కల్మాషపాదుడను రాజును కోరినట్లు భారతాది పర్వము సప్తమాశ్వాసమునందు కలదు.

మఱియు వీరిలో గొందరు వైష్ణవులను వారును సాతాని వైష్ణవులనువారును యీ నాటికిని భాగవత కైంకర్యమను పేరునను, రామానుజ మతమను పేరునను చేయుచుండు కృత్యములలో మధు మాంస భక్షణమును వావిపరుసలు లేని స్త్రీ సంభోగ

ములును వామ మార్గమను పేరున జాతివర్ణాశ్రమ ధర్మమునకు విరుద్ధముగా జాతి భేదముల పాటింపక వైష్ణవ మతస్థులనును పేరున ప్రవర్తించు చుండు నామధారుల ఇండ్లలో జరుపుచుండు దేవ, పితృకార్యముల విషయము చెప్పుటకే సిగ్గగు చున్నది. ఆ మతము నందుండెడి రసాభాసమును జూచియే ప్రజలిట్లు చెప్పుకొను చున్నారు.

సీ॥ మధ్య మాంసములతో మహిని రామానుజ
కూటముల్ చేసి భక్తుల మటంచు
రవికె లోత్సవమున వావి వరుసలు లేక
క్రీడింతురది విష్ణు ప్రీతియనుచు
.....................................
.... .... ..........................
మరి మధ్య మాంసంబు గురువు మెసవి క్రక్క
చెలగిమెక్కుదు రాత్మశేషమనుచు
చతు రక్షరి యటంచు జతపడి గురు
.... .... విర్యో చ్ఛిష్టములు గుడుతురు,
పెరుమాళ్ల నైవేద్య పిసిత మధ్యంబులు
గురువు ముందుగదిని కోరి యెంగి
లిచ్చిన దిని మదమెక్కి శిష్యుడు లేచి
గురు పత్నిపైబడి.... ......పగుల
ద్రొబ్బుగురుడును మదమెక్కి తోడు తోడ
శిష్య పత్నితో గ్రీడించి సిగ్గు లేక
పరగ నిబ్బంగి పడరానిపాట్లు బడుచు
రవనిలో కొంద రాభాస రసిక జనులు॥

ఇవియన్నియు నేటికాలమున జరుగుచున్నవని చెప్పజాలక పోయినను కొన్ని మాత్రమైనను జరుగుచున్నవని అందరికిం దెలిసిన విషయమే.

భైరవమను పేరుతోను శాక్తేయమను పేరుతోను వున్నట్టి కార్యములను గురించి వ్రాయుటకు హిందూమత ధర్మము లిట్టివేనాయని యితర మతములవారు గేలిసేయుదురను కారణమునను, నేనును హిందువుడనను నభిమానము గలవాడనై విరమించి ఒక్క ఉదాహరణము మాత్రమిచ్చు చున్నాడను.

ఉడ్డీశ తంత్రమున నొక ప్రయోగముగలదు. అదేమనగా ఒక యింటిలో నాలుగు ప్రక్కలను గూడు లుండవలయునట; వానియందు సారా సీసాలునింపి పెట్టవలయునట. ఆ గూడులలో నొకదాని యందలి సారాద్రాగి రెండవ గూటికి బోవలయునట. అచ్చటనున్న సారాత్రాగి మూడవ గూటికి బోవలయునట. అచ్చటి సారాయిని స్వీకరించి నాల్గవ గూటికి బోవలయునట. ఇట్లు నిలిచి నిలిచి కఱ్ఱవలె భూమి మీద పడకుండునంత వరకు సారాయిద్రాగవలయునట మఱల మత్తు దిగినపు డదేప్రకారము త్రాగి త్రాగి నేలమీద బడవలయునట. మఱి మూడవ పర్యాయము నిదే రీతిని ద్రాగి క్రిందబడి లేచినవానికి పునర్జన్మముండదట.

"పీత్వా పీత్వా పునః పీత్వా యావత్పతిత భూతలే।
పున రుత్థాయ వైపీత్వా పునర్జన్మ విద్యతే"
మహానిర్వాణ తంత్రము ॥స॥ ప్ర॥

త్రాగి త్రాగి మరల త్రాగి భూమిపై స్మారకములేక పడి తిరిగిలేచి త్రాగి యీ విధముగా ఎక్కువ త్రాగినవానికి పునర్జన్మ లేదట. ఇంకను వినుడు. వీరియింటి పితృ కార్యములందు

మకార పంచకము నర్పించిన మోక్షము గలుగుననియు కొందరు చెప్పుచుందురు.

"మధ్యం మాంసంచ మీనంచ ముద్రా మైథునమే వచ।
ఏతే పంచమకారాః స్యుర్మోక్షదాహి యుగే యుగే.
(కాలీ తంత్రం) స॥ ప్ర॥

అనియు కూడ చెప్పియున్నారు.

"ప్రవృత్తే భైరవీచక్రే సర్వే వర్ణా ద్విజాతయః।
నివృత్తే భైరవీచక్రే సర్వే వర్ణాః పృథ క్పృథక్॥
(కులార్ణవ తంత్రమ్) స॥ ప్ర॥

"మాతృయోనిం పరిత్యజ్య విహరేత్సర్వ యోనిషు।
వేదశాస్త్ర పురాణాని సామాన్య గణికాఇవ।
ఏకైవ శాంభవీ ముద్రా గుప్తాకుల వధూరివ॥
(జ్ఞాన సంకలినీ తంత్రము) స॥ ప్ర॥

ఈ యజ్ఞానులగు పోపుల లీలలెట్టివో చూడుడు! వేద విరుద్ధమును మహా అధర్మమునగు వానినే (రామానుజ మతస్థులు) వామ మార్గులు శ్రేష్ఠమని యెన్నిరి. మధ్యము, మాంసము, మినము, (చేపలు) ముద్ర, గారెలు బూరెలు మున్నగు పిండి వంటలు, యోనిపాత్రధార ముద్రలు, నైదవది మైథునము అనగా పురుషులందరును శివులుగాను స్త్రీలందరు బార్వతులుగాను ఎంచి.

"అహం భైరవస్త్వం భైరవీ హ్యేవ యోరస్తు సంగమః" అను నీ యసంగత వచనములు చదువుచు సమాగమము చేయుట వామమార్గులకు దోషముగాదు. అంటరాని నీచ స్త్రీలతో బోవుట మహాపవిత్రమని యెంచి యున్నారు. శాస్త్రములలో రజస్వలాది స్త్రీలను దాకుటగూడ నిషేధించి యుండగా వామ

మార్గులు దానిని మహా పవిత్రమని నమ్ముచున్నారు. వీరి శ్లోకముల వ్యర్థాలాపముల జూడుడు.

"రజస్వలా పుష్కరం తీర్థం జాండాలీతు స్వయంకాశీ।
చర్మకారీ ప్రయాగః స్యాద్రజకీ మధురా మతా॥
అయోధ్యా పుక్కసీ ప్రోక్తా॥ (రుద్రయామల తంత్రము)

రజస్వలయైన స్త్రీతో జేరిన బుష్కరస్నానము చేసినట్లును, హీన జాతి స్త్రీతో బోయిన గాశీయాత్ర జేసినట్లును, చాకలిదానితో గూడిన మధురా దర్శనము చేసినట్లును, భోగముదానితో గలసిన నయోధ్యను దర్శించి వచ్చినట్లును భావింపవలసినదట మద్యమునకు "తీర్థ" మనియు, మాంసమునకు "శుద్ధి" "పుష్ప"ములనియు, మత్స్యమునకు "జలతుంబిక, 'జలపుష్ప'మనియు, ముద్రకు "చతుర్థి" మైధునమునకు 'పంచమి' యని నామములిడియున్నారు, ఈ నామములుంచుటకు కారణము వాని నితరులు దెలిసికొనరాదనుటయే॥ స॥ ప్ర॥ ఇట్లు చెప్పియుండుటచే ఆహార విషయమును గురించి కొంత దెలిసికొంటిమి గదా! ఇక వ్యభిచారాది గుణంబులను గురించియు జాతి నిర్ణయములేని వివాహముల గురించియు దెలిసికొందము,

పాఠకులారా! ఈ గ్రంథాన్ని జదువునపుడు మతవైరపు దృష్టితోను నాజాతియే అన్నిజాతులకంటె శ్రేష్ఠమైనదను దుర్భాంతితోను గాక యథార్థ విషయక దృష్టితోను అందరును సమానులమను దృష్టితోను చదువ ప్రార్థన.

ఈ త్రాగుబోతు మతస్థులు భైరవీచక్రము నందున్నపుడు బ్రాహ్మణుడను వాడు మొదలుకొని చండాలులవఱ కందరును ద్విజులగురనియు, నా భైరవీచక్రమును వదలినతోడనే మఱల

దమ తమ వర్ణస్థులగుదురనియు వారు చెప్పుదురు. భైరవీచక్రమును వామ మార్గులు భూమిమీదనో లేక పలకమీదనో యొక బిందువును త్రికోణ, చతుష్కోణ, వర్తులాకారముగ వ్రాసి దాని మీద నొక సారాబుడ్డీ నుంచి దానికి పూజచేసి (బ్రహ్మశాపం విమోచధ) "ఓ మధ్యమా! నీవు బ్రహ్మశాపము నుండి విముక్తి జెందుము." అను నీమంత్రమును బఠించుతూ వున్నారు. వామ మార్గులు చేరుచోటి కితరులను రానీయరు. అట్టి రహస్య స్థలమున స్త్రీ పురుషులందరును జేరుదురు. పిమ్మట నచ్చట నొక స్త్రీని దిగంబరనుచేసి పురుషులను ఒక పురుషుని వస్త్ర హీనునిఁ జేసి స్త్రీలును బూజింతురు. అచ్చటికి స్త్రీ లనేకులు ఆయా పురుషుల భార్యలు, కుమార్తెలు, అక్క చెల్లెంద్రు, కోడండ్రు మున్నగు వారందఱు వత్తురు, తరువాత నొకపాత్ర నిండ మధ్యము నింపి యొక పళ్లెమున వండిన మాంసము, వథలు, మొదలగు పదార్థముల నుంతురు. వారలలో నాచార్యుడైనవాడు ఒకగిన్నెలో సారాయి పోసి చేతనుంచుకొని (అహం భైరవోఽహం" శివోఽహం") అనగా నేను భైరవుడను, శివుడను అనిచెప్పి దానిని త్రాగును. మఱల నాయెంగిలి గిన్నెతోనే తక్కినవారు త్రాగుదురు. పిమ్మట నొక మగనాలినో వేశ్యనో లేదా పురుషునో వస్త్రహీనులుగాజేసి చేతికొక కత్తినిచ్చి ఆస్త్రీని దేవియనియు, బురుషుని మహాదేవుడనియు బిలుతురు. వారి యుపస్థేంద్రియములను బూజింతురు. పిమ్మట నాదేవికో శివునకో యొక గిన్నెడు సారాయి త్రాగించి ఆ యెంగిలి గిన్నెతోనే యందఱు నొక్కొక గిన్నెడు సారాయి పుచ్చుకొందురు. మఱల నదేరీతిని క్రమ క్రమముగా నందఱును త్రాగి త్రాగిమై మఱచి ఎవరికెవరి యందిష్టముండునో యట్టివారితో 'తోబుట్టువు

'కూతురు' యని కూడ జూడక కుకర్మనె సల్పురు. యీ విషయ మంతయు దయానంద సరస్వతిగారు సత్యార్థ ప్రకాశికయందు వివరముగా వ్రాసియున్నారు. యీ వైష్ణవ మతాచార్యుల యొక్కయు, సాతాని వైష్ణవుల యొక్కయు, వామ మార్గుల యొక్కయు మతాచారములఁ జదివిన ఆశ్చర్యపడకపోరు గదా!

నిజమైన బ్రాహ్మణుడందరి కంటెను అధికుడను విషయ మునేను కాదనుటలేదు. అధికస్థానమగు బ్రాహ్మణ పథము నాక్ర మింపదలచువాని విషయముననే నాయీ సందేహము. బ్రాహ్మ ణుడు గాకనే బ్రాహ్మణ కర్మము లెట్టివను విషయము తెలుసు కొనకనే తెలుసుకొనుటకైన ప్రయత్నించకనే బ్రాహ్మణ పదమును పట్టా పొందినవాని వలెనే నేనే బ్రాహ్మణుడనని ప్రగల్భములు కొట్టు నామధారులగు బ్రాహ్మణ బ్రువులనేను విశ్వసించలేకు న్నాను. ఈ వైష్ణవ బ్రాహ్మణులగురించి ఒకటి రెండు మాటలు చెప్పి అవలకెళ్లుదము. యీ వైష్ణవులు యితరజాతుల వారందరికి గూడ వైష్ణవ మతమును దానిని బోధించి వారుతినుచుండు మద్య మాంసాదులకు యితరులు తెలిసికొన కుండుటకై మారు పేరులు బెట్టి యున్నారు. భాగవత కైంకరార్థమను పేరున యీ వైష్ణవు లందరు పితృ కార్యములు, దేవ కార్యములు చేయునపుడు సారా యికి వస్తువనియు, సారాబుడ్డికి ఘటపాత్ర యనియు, అదిపుచ్చు కోడానికి వస్తుదర్శన మనియు, టెంకాయ కల్లుకు ఆకాశపా లనియు, తాటి కల్లునకు కల్పకతేనె యనియు, అవి త్రాగుటకు తాపశాంతి యనియు, మాంసమునకు సిద్ధియనియు, మత్స్యము నకు జలతుంబిక, జలపుష్పమనియు, కడవాడుకు కాంతియనియు, కోడికి కుప్పకిరు వనియు, సారాయి త్రాగునపుడు తొలిసారి

పాత్రకు స్థూలపాత్ర యనియు, రెండవసారి త్రాగు పాత్రకు సూక్ష్మ పాత్ర యనియు, మూడవసారి త్రాగు పాత్రకు కారణపాత్ర యనియు అందురు. త్రాగుపాత్రరు భైరవపాత్ర యనియు పేర్లు పెట్టుకొని యున్నారు. వీరిని గురించి వేమన్నగారు చెప్పినది వినుడు.

ఆ॥ ఎంబెరు మతమంచు నెసఁగ మాంసముతిని
మారుపేరు బెట్టి మధువు ద్రావి
వావివరుస దప్పి వలికి పాలౌదురు ॥విశ్వ॥

ఆ॥ అచ్చువేసి కొనుచు నడియేని ననుచును
తమ్మ దిన్నవెనుక దాసుఁడనిన
పరమ పదమురాదు ప్రకట నార్థమెకాని ॥విశ్వ॥

ఆ॥ పట్టుబట్టి గట్టి పట్టె నామము బెట్టి
వట్టిభ్రాంతి జెంది వైష్ణవ డయి
లొట్టి దాగి యతఁడు లోకుల జెఱచురా ॥విశ్వ॥

ఇంకను వైష్ణవ మతస్థులు సమాశ్రీణమను పేరున శంఖు చక్రములను ముద్రలు వేయుటను గురించి ఇట్లు చెప్పి యున్నాడు.

"పుట్టినపుడె బొడ్డుపట్టి కోయుచు నుండ
నప్పుడు గురు ముద్రలానతి పడె
ముద్రలేని వారు ముజ్జగంబుల లేరు ॥విశ్వ॥

"శిల్పి ముద్రలేని శిలకు పూజలు లేవు
శిల్పి వలన గలిగె జగములన్ని
శిలల మ్రొక్కులెల్ల శిల్పికి జెందును ॥విశ్వ॥

"శిల్పి పూజలేక శిలను పూజించిన
శీఘ్రముగను రాజు సిరియు జెడును.
శిలనుగన్న తండ్రి శిల్పియని తెలియురా ॥విశ్వ॥
"విశ్వకర్మ బిడ్డ లీలలోన దేవుళ్లు
కానకున్నవారు కర్మ నరులు
విశ్వకర్మ లేక విశ్వంబు మరిలేదు. ॥విశ్వ॥
"దేవళంబు గట్టి దేవుని నిర్మించి
దేవతార్చకులకు తెరవు జూపి
కుంచకోల నొసగు గురువును జూడరు. ॥విశ్వ॥
"నామ దారులెల్ల నీమముతో జేరి
శంఖు చక్ర ముద్ర లెక్కువనిరి
ముద్ర లెల్లచేయు మూర్తిని గానరు ॥విశ్వ॥

ఈ వైష్ణవ తెగలోని ఆళ్వారులు, ఆచార్యులును పరిచయం చేయు చున్నాను. 11 మంది ఆళ్వారులు, తిరుమళిశై ఆళ్వారు, కులశేఖర ఆళ్వారు, మదురకవి ఆళ్వారు, నమ్మాళ్వారు, (శఠకోపన్) పెరియాళ్వారు, అండాల్ ఆళ్వారు, పేయాళ్వారు, పొయ్గై ఆళ్వార్, పుదత్తాళ్వార్, తిరుమంగై ఆళ్వార్, తిరుప్పణాళ్వార్ అనువారు గలరు యిక వైష్ణవాచార్యులు - తిరుమాలై అండాన్ - మహుక్కాల్‌నంబి-కిడాంబి రంగరాజ్ - పిరాట్టియార్- ఉయ్య కొండార్ - కిడాంబి అప్పుళార్ - ఎంబెరుమానార్ - కోమండూర్ ఇళయవిల్లి - కిడాంబి అచ్చాన్ - నడాదూర్ అమాల్ - తిరువ రంగప్పెరుమాళరైయర్ - తిరుకోట్టియూర్ నంబి - ఎంగళాళ్వాన్ - నాథమునిగల్ - ఆళవందార్-వేదాంత దేశికన్ - తిరుమలై నంబి - సేనై మొదలియార్- కిడాంబి రామానుప్ప

ళ్వాన్ - తిరుక్కురుగైపిరాన్ పిళ్ళాన్ - అను వారున్నారు. ఇందులో వీరిలో తక్కువజాతి వారలలోని వారుకూడా ఈ మతములో చేరి ఆళ్వారులు, ఆచార్యులు అయినట్లు చరిత్రల వలన దెలియుచున్నది.

యీ విధముగా నామధారులను గురించి చెప్పియున్నాడు. గాన విచారణ శీలురగు తమ ఎదుట యీ విషయమును పరిశీలింపగోరి చెప్పియున్నాను. యీ నామధారి బాపల యొక్క ఆహార ఆచార వ్యవహారాదుల గురించి కొంతదెలిసి కొంటిమిగదా! ఇక వీరి జాతి నిర్ణయములేని వివాహముల గురించియు, వ్యభిచారాది గుణంబుల గురించియు పరిశీలింతము. పురాణములయందు బ్రాహ్మణ జాతికి చెందినట్లు చెప్పబడు ఋషులు అనేక మంది వ్యభిచారములు చేసినట్లు పెక్కుచోట్ల గానంబడుచున్నవి. వసిష్ఠుడు కల్మాషపాదుని భార్యయైన మదయంతిని రమింప యామె గర్భంబుదాల్చి పండ్రెండేడులు గడవ వేసారి యశ్మశకలంబున (రాయితో) ఉదర భేదనంబు చేసిన అశ్మకుండను రాజర్షి పుట్టెనట. నదృశ్యంతికి బరాశరుండుదయించెనని భారతము ఆదిపర్వము సప్త మాశ్వాసమునందు చెప్పబడినది. ఇతడు కుండక జాతికి చెందియుండ లేదా ? యీ పరాశరుండే మత్స్యగంధి (యోజనగంధి) ని పడవయందే మోహించి యెంత నివారించినను వినక పగటివేళనే రమించగా పెండ్లిగాని శూద్ర కన్యకకు (మత్స్యగంధికి) వ్యాసుండు పుట్టినట్లు అదే భారతమునందు జెప్పబడినది. పెండ్లికాని శూద్ర కన్యకకు పరాశరునకు పుట్టిన వ్యాసుడు ఏ జాతికి జెందినవాడో పాఠకులగు మీరే నిర్ణయించండి. యీ వ్యాసుడు పదునెనిమిది పురాణములకు కర్త యని పేరొందియు

భర్త చనిపోయిన విధవలను బొంది పాండవుల బుట్టింప జేసెను. ఇట్టి పాండవ వంశ కర్తలు ధృతరాష్ట్ర పాండురాజులు కుండకులో గోళకులో మీరే నిర్ణయింపుడు. యిందులకు ప్రమాణము కూడ చూడుడు.

శ్లో॥ పరదారేషు జాయేతే ద్వౌసుతౌ కుండ గోళకౌ।
పత్యౌ జీవతి కుండః స్యాన్మృతే భర్తరి గోళకః॥
(మనుధర్మ శాస్త్రం 3 వ అధ్యాయం 174 శ్లోకం॥)

కౌరవ పరాశరుని పక్షమున చూడుడు. భర్త జీవించి యుండగా నొరుని సంగమమున బుట్టినవాడు కుండుడు. భర్త మృతినొందగా నన్య పురుషుని వలన బుట్టినవాడు గోళకుడు. మఱియు వ్యాసుని విషయమై కొంత విచారింతము; "విజాతీయ మాతా పితృ కత్వాత్ ఉభయ వర్ణాభ్యాం సంకీర్ణన్య ఇతి సంకీర్ణః।" విజాతీయులైన తల్లి దండ్రులు గలవాడు సంకీర్ణు డన బడును. అని అమరకోశమునందు చెప్పబడినది. వీరిలో నొక్కొక్కరు అనగా కుండగోళక జాతులవారు మహాపేరు ప్రఖ్యాతు లందినవారై యున్నారు. వసిష్ఠుడు బ్రాహ్మణ జాతికి మూలపురుషుడు మఱియు స్మృతి కర్త, పరాశరుడు స్మృతి కర్త, వ్యాసులు పదునెనిమిది పురాణములకు కర్త. అట్టివారి స్థితియే ఇట్టులుండ యికసామాన్యులగు నామధారుల గురించి యేమి చెప్పవలయునో ఊహింపనలవిగా కున్నది. నారదుని విషయమును గురించి కొంత పరిశీలింతము. నారదుడు తనతల్లి తగువైన వారి యిండ్లయందు దాస్య కృత్యములు చేయుచున్న దాసికి జన్మించిన వాడునై (దాసీపుత్రుండగుటచే తండ్రి పేరు దెలియదు) నేను వారి వారిచేతం బోషింపబడు చుంటినని తల్లి చెప్పుకొన్నట్లు భాగవతము ప్రథమ

స్కంధమునందు వ్రాయబడియున్నది. అందుకనే వేమన యోగీంద్రుడు కూడ "చాకలిదానికి పుట్టెను-చేకొనిపో నారదుండు చెప్పగనేలా" అన్నాడు.

సాందీపునివద్ద శ్రీ కృష్ణుడు విద్య నేర్చుకొనునపుడు తన గురువుల వారితో శ్రీ కృష్ణుడు కులముల యెక్కువ తక్కువలను గురించి అడుగగా తన గురుండగు సాందీపఋషి శ్రీ కృష్ణునితో నాయనా! విను పంచభౌతికములగు యీ మానవ దేహంబు లన్నియు అన్నరసంబు వలన గలిగిన మదముచే స్త్రీ పురుషులు రమింపగా ఆనందమయముతో వెలువడిన శుక్ల శోణితములు గర్భంబున పిండంబై యుద్భవించినవి. తదుపరి అభివృద్ధి నొంది వృత్తిచేత కులములు యేర్పడినవే కాని యితరములు కావు. విప్రులే అధికమని భావించుటకు వీలులేదు. "అజ్ఞానమె శూద్రత్వము సుజ్ఞానమె బ్రహ్మ మంత్రు శృతి వినలేదా" అని చెప్పియున్నారు. ఎక్కువ కులమును నిర్ణయించుటెట్లు - మాదిగవాని అడిగేవాడు డక్కలవాడు - డక్కలవాని నడిగెవాడు మూగలవాడు - మూగలవాని నడిగేవాడు చపల మూగలవాడు - చపల మూగలవాని నడిగేవాడు కులస్తుడు - కులస్తు నడిగేవాడు కుల హీనుడు - కులహీను నడిగేవాడు మైలపు సొక్కన్న - మైలపు సొక్కనను అడిగేవాడు సొప్పకట్టివాడు - సొప్పకట్టివాని అడిగే వాడు సింహనిశిష్టు - సింహనిశిష్టును అడిగేవాడు చపల చోరకుడు - చపల చోరకుని చెల్లెలు ఊర్వశి - ఊర్వశిని బొంపినవాడు బ్రహ్మ - బ్రహ్మకు పుట్టినవాడు వసిష్టుడు ఇట్టిజాతి యందుద్భవించిన వసిష్ఠుడు కృతయుగంబున హరిశ్చంద్రునకు గురువు కాలేదా? సలచక్రవర్తికి గురువు కాలేదా? త్రేతాయుగమున రాము

లను గుర్తింప కాలేదా? ఆ వసిష్ఠుని సంతతి తెలిపెద వినుము. వసిష్ఠుని భార్య ఛాండాలి (అరుంధతి) వీరిద్దరికి పుట్టినవాడు శక్తి ముని, ఇతని భార్య శ్వపచాత్మ (మాల) శ్వపచాత్మ కుమారుడు పరాశరుడు - పరాశరుని భార్య కైవర్తి (యోజనగంధి లేక మత్స్యగంధి) కైవర్తికి పుట్టినవాడు వ్యాసుడు - వ్యాసుని కొమార్లు పాండవులు. మరియు శుకుడు-ఇట్లు వీరందరును స్వల్పజాతియందు ఉత్పన్నమైనను వారువారుచేయు కృత్యముల (కర్మల) వలన శ్రేష్ఠత్వమును బొందిరి అనిచెప్పిరి. (ఈ విషయము సాంధిపకృష్ణ సంవాదంబను గ్రంథమున 17 వ పేజీ యందు గనందగును.) గ్రంథంబుల యందుండెడు ఇట్టి రహస్యంబుల తెలిసికొనక యున్న ప్రజావళిని ఈ నామధారి బ్రాహ్మణత్వముతో మోసగించి కాయకష్టోలంఘనులై ప్రవర్తించుచు నుండు నంతకాలము దేశము భివృద్ధి కాజాలదు. ఏ కర్మ బ్రహ్మకర్మయో తెలిసి అట్టి బ్రహ్మకర్మను ఆచరించు వారు బ్రాహ్మణులని గుర్తించుట ముఖ్యమై యున్నది.

ఆ॥ పుట్టు బ్రహ్మలైరు పుడమిని నడుపగా
కాళ బ్రహ్మలేమొ స్వచ్ఛమనిరి
వసుధలో వెలుగరు వాసిష్ట కులముని ॥విశ్వ॥

॥ఆ॥: విశ్వమున్నడి పెదు విశ్వేశ్వరుండుండ
బాపనులకు నేల పాటిదక్క
వనములోన కోతి వసుమతి నడుపునా ॥విశ్వ॥

అనికూడ వేమనగారు చెప్పియున్నారు సోదరులారా! యింత వరకు యీ నామధారి బ్రాహ్మణులను వారియొక్క ప్రవర్తనలు జన్మలు ఆహార విహారాది విషయముల దెలిసికొంటిరి

గదా! ఇక వివిధ పేర్లతో పిలువబడు నామధారుల యొక్క ఆచార వ్యవహారములందెలిసి కొందము.

బ్రిటీషు జాతికి జెందిన హంటర్ దొరవారిచే రచింపబడిన "ఎంపైర్ ఆఫ్ ఇండియా" అను గ్రంథమున హిందువులలో మొత్తము 3 వేల జాతులున్నవనియు అందు బ్రాహ్మణులను వారు 1886 జాతులు గలవనియు వ్రాయబడి వున్నది. రాజపుత్రులను వారిలో 591 జాతులున్నట్లును వ్రాశియున్నారు. మఱియు సారస్వత బ్రాహ్మణులలో 250 జాతులున్నట్లును, వారిలో 50 ఉచ్చజాతులుగను, 172 నీచ జాతులుగను ఉన్నట్లును వ్రాయబడివున్నది మఱియు కాశ్మీరు బ్రాహ్మణులను వారిలో 221 జాతులును గుజరాతి బ్రాహ్మణులలో 160 బేధము లున్నట్లును, మహారాష్ట్ర బ్రాహ్మణులను వారిలో 32 బేధము లున్నట్లును వివిధ జాతులు మొత్తం కలిసి 1886 జాతులుగా నున్నట్లును తెలియుచున్నది అందు నిజమైన లేక శుద్ధమైన బ్రాహ్మణు లెవరు ?

(భటాంచ దోర్దండ ఖండన పుట 6. 3.)

ఇంతియేగాక రజక బ్రాహ్మణులు (బట్టల నుతికెడువారు) యాజ్ఞ వల్క్య బ్రాహ్మణులు (యాజ్ఞ వల్క్యులు) భిసర బ్రాహ్మణులు (సిద్దీలనుండి పుట్టినవారు) దివిటీ బ్రాహ్మణులు (కాగడా పట్టెడువారు) బోయీ బ్రాహ్మణులు (పల్లకీలు మోయువారు) రండ బ్రాహ్మణులు - ముండ బ్రాహ్మణులు - గోళక బ్రాహ్మణులు (భారతీయ సామ్రాజ్యము) కోరి లేక కోళీ బ్రాహ్మణులు (చేపల బట్టెడువారు) వారీ బ్రాహ్మణులు (ఆకుల నమ్మెడివారు) (బ్రాహ్మణ నిర్ణయం) జవళీ బ్రాహ్మణులు (వ్యవసాయ

ముజేసెడివారు) (జాతి వివేకసారము) మొదలగు అనేక జాతు లున్నట్లును, మరియు మార్వాడీ బ్రాహ్మణులకు, గుజరాతి బ్రాహ్మణులకు ఎవరైతే నీళ్లు మోయుట, వంట చేయుట మరియు పంజాబు, కాశ్మీర బ్రాహ్మణులలో యెవరు బట్టల వ్యాపారము చేయుచు దేశమును తిరుగుచుందురో అట్టివారును బ్రాహ్మణులుగా నున్నట్లును అందులో అనేకులురగు బ్రాహ్మణు లనబడువారిలో మౌంజిధారణ అనగా ఉపనయనాధి కారము నూటికి 75 మందికి లేనట్లును తెలియుచున్నది కేవలము ప్రజల వలన సిగ్గునకై కొందఱు యేయొక్క సంస్కారములేకనే జందెములు మెడయందు వేసికొనుచున్నారు. వారికి గాయత్రి మంత్రమునందలి ఒక శబ్దమైనను ఉచ్చరించుట తెలియదు. వారు మొదలే అక్షర శత్రువులు. మరియు సంస్కార హీనులుగా నున్నారు. ఇటువంటి సత్య చరిత్రలు నూర్లు, లక్షలు: ఎల్లపుడును అందరి కండ్లయెదుట సాక్ష్యమునకై యున్నట్లు కనుపించుచున్నవి,

(క్షత్రియాంచ ఇతిహాసము 1929) పుట 113)

చిత్పావన (కొంకణస్థ) బ్రాహ్మణ విధవలు ఇతర బ్రాహ్మణవిధవ స్త్రీలకు వలెనే వివాహములు చేయుట అధికముగా నంతటను లేదు. అందులకు అధికములగు నిరోధములును లేవు. వీరిలో నూటికి 55 మందికి విధవ స్త్రీలకు వివాహములు జరిగినవి.

(బ్రాహ్మణ పోటవికీకరణము పుట 32)

పల్లెవాల బ్రాహ్మణులకు ముఖ్యవృత్తి వ్యాపార మగుట చేత వారిలో స్వశాఖీయ పురోహితులు నగుపించుట లేదు. (బ్రాహ్మణ పోవికీకరణము భాగము 2 పుట (30) శుక్ల యజుర్వే

దీయులగు నర్మదీయ బ్రాహ్మణులలో మంత్రాగ్ని దాదాపు నొక విధముగా నుండలేదు. (బ్రాహ్మణ పో ఏకీకరణము పుట 32) జంబూకణ్వ బ్రాహ్మణులలో స్వశాఖీయ పురోహితులు లేరు. (పుట 46) గుజరాతి దేశపు బ్రాహ్మణులు శూద్రులచేతి నీళ్లు త్రాగుదురు. బ్రాహ్మణ నిర్ణయం పుట 120) సంబూరి బ్రాహ్మణులు క్షత్రియులు వండిన అన్నమును భుజింతురు. (బ్రాహ్మణ నిర్ణయం పుట 120) కాశ్మీర బ్రాహ్మణులందు ఆ విధముగానే బంగాళా దేశమునందును కన్యా కుబ్జ (కనోజీ) బ్రాహ్మణులలో సైతము గృహ కృత్యములకు మహమ్మదీయులనే నౌకర్లుగా నుంచుకొనెదరు. (బ్రా॥ పుట 125—126) శ్రీ మౌళీ బ్రాహ్మణులు గొల్లవారి చేతి వంటకముల భుజింతురు. (జాతిభేద వివేకసారము) నేపాళీ బ్రాహ్మణులను వారిలో విధవస్త్రీలు వేశ్యలతో సమానముగా వ్యవహరింతురు. ఆ విధముగానే పంజాబు నందలి గౌడ బ్రాహ్మణుల వారియందు గూడ విధవలు వేశ్యలతో సమానముగ వ్యవహరించు చుందురు. (బ్రాహ్మణ నిర్ణయం 127)

దక్షణీయ బ్రాహ్మణులు పునర్వివాహములు జేయుచున్నారు. అభక్ష్య భక్షణ (తినకూడనివి తినుట) అపేయ పానము (త్రాగ కూడనివి త్రాగుట) గలిగి నూటికి నూరుమంది బాలురకు జందెములు వేయుటలేదు. క్రైస్తవులతోడ మఱియు, మహమ్మదీయుల తోడను, యూరోపియనుల తోడను భోజనములను, వివాహములను భేధములను పాటించక సమత్వముతో జేయుచున్నారు. అయితే మొత్తముమీద సంస్కార హీనతవల్లను, పునర్వివాహములవల్లను, వారికి లేక పరధర్మము నందలి స్త్రీలకు బుట్టిన వారి పిల్లలకు న్యాయవేత్తలు న్యాయస్థానము లందు

శూద్రులుగా తీర్పు చెప్పుటలేదు. శుద్ధబీజ బ్రాహ్మణులనియే నిర్ణయించు చున్నారు. (క్షత్రియ ఇతిహాసము పుట 125)

మరియు బ్రాహ్మణులను జాతి వారిలోని పేర్లను తెలిసినంతవరకు యిట ఉదహరింపబడు చున్నవి. బ్రాహ్మణులను వారిలో దేశబేధములను బట్టి పంచ ద్రావిడులనియు, పంచ గౌడులనియు రెండు విధములుగా జెప్పబడు చున్నారు. అందు వలన ద్రావిడులలో 1 మహారాష్ట్రులు 2 ఆంధ్రులు, 3 ద్రావిడులు, 4 కర్ణాటకులు, 5 ఘూర్జరులనువారు గలరు.

మహారాష్ట్రులలో కాణ్వ బ్రాహ్మణులు, కీర్షంత, కర్ణాటక, కొకణస్థ, దేవస్థ, దేవబుక్ష, మాధ్యందిన, పళక, బరాడా, కళంక, పాండ్య, సోపారా, గోముఖ, ఝూడే, కుంక, మొదలగు వారు మహారాష్ట్ర దేశమునగల బ్రాహ్మణ శాఖలలోనివారై యున్నారు. ఆంధ్రులలో వెలనాటి, తెలగాణ్య, మురికినాటి, కోసల లేక కాసలనాటి, వేంగినాటి పర్ణసాల, తెలంగ, సామవేద, కరణకమ్మ, నియోగులు, వాజసనేయులు, ఆరాధ్యులు మొదలగు వడమల బ్రాహ్మణులు, మాధ్వ బ్రాహ్మణులు, చోళి, తన్నారము, తిల్లము వ్వారము, వీరందరు ద్రావిడశాఖ బ్రాహ్మణులలోని వారై యున్నారు. కర్ణాటక బ్రాహ్మణులు, వీరిలో అఱవ తెక్కలను బ్రాహ్మణులు, ఉరిచ, కన్నడ, కురళే, నగర బ్రాహ్మణులు, బొబ్బర బ్రాహ్మణులు మొదలగు వారును గలరు. ఘూర్జర బ్రాహ్మణులు వీరిలో అగస్త్యులవాలులు అనువారును, అనావలులను వారును, అక్షయ మంగళులను వారును, కపిలలను వారును, ఖరాయుతి, ఔదీచ్య, గయాళి, పహరి, ఖేడావాలురు,గగ్గారి,గోమతి, చాతీపు, జంబూ, ఝూలోరా, దధీచీ. పారాశర, భార్గవ, నర్సపర,

తలాజీయు, తపోధన, యాజ్ఞకవాలు, వటులను వారును, వళాంధ్ర వాల్మీక, సదో్రజా, శ్రీ మాళీ, శైవ, శాక్తేయ మొదలగు బ్రాహ్మణ నామధేయులున్నట్లు తెలియుచున్నది.

పంచ గౌడులను వారిలో సారస్వతులు, కన్యాకుబ్జులు, గౌడులు, ఉత్కళులు, మైథల అని అయిదు తెగల బ్రాహ్మణులున్నట్లు తెలియుచున్నది. మరియు సారస్వత బ్రాహ్మణులలో మూడు తెగలుగ నున్నవి, 1 కపూరియే, 2. ఆచార్యే, 3. ఆమ గోత్ర బ్రాహ్మణులు. అందు మొదటి తెగవారు కపూరియే బ్రాహ్మణులు. వీరిలో కాపాలే, కావియె, కురల, కుమరియె, గైంధార, చుని, ధత్త, ధన్నపాత్రే, నవరె, పండిత, పాతక, బగె, బాలే, ప్రభాకర, భరద్వాజీ, సూరియె, పాండ, సింఘె పోత్రే, షోరీ బ్రాహ్మణులనువారు మాధ్యందిన కాణ్వశాఖలకు జెందిన యజుర్వేదీయులను బ్రాహ్మణులు గలరు వీరు మేకలను, దుప్పలను, పక్షిజాతులను, చేపలను భక్షించెదరు. వీరిలో కొందరు సంబంధ బాంధవ్యములు గలవారు కొందరు. భోజనములు మాత్రమే కల వారు మరికొందరు. భోజన బాంధవ్యములు రెండునుగలవారుగా కొందరును వున్నారు. వీరు లాహెూరు, అమృతసర్ బాటలా, గురుదాసపూర్, జలంధర్, ముల్తాన్, షహపూరు యీ స్థలముల యందున్నట్లు తెలియు చున్నది,

రెండవ తెగవారు ఆచార్యే, దీక్షిత, నాగర, శిష్టకరణ, రాయణీ వేదక. బ్రాహ్మణులు అనువారు నున్నట్లు తెలియు చున్నది. వీరు శుక్ల యజుర్వేదీయులు వీరు చేపలను తప్ప యే యితర మాంసములను భుజింపరు. యీ శాఖలవారు కాంగడా యందును, తత్సమీపవన్యము లందును నివసించు చుందురు.

వీరిలో ఒకరితో మరొకరికి సంబంధ బాంధవ్యములును గలవు.

మూడవ తెగవారు అమగోత్ర, కేసర, శిఖర, వైద్య బ్రాహ్మణులు అనువారు గలరు వీరిలో ఒకరితో నొకరికి సంబంధ బాంధవ్యములు గలవు వీరు దేవీ వృపాసకులు కూడ.

"కన్యాకుబ్జులు" వీరిలో ఉపాధ్యాయ, జేజే, తివారి, దీక్షిత, దుబే, మిశ్ర, శుక్లయను బ్రాహ్మణులును గలరు.

గౌడ బ్రాహ్మణులు వీరిలో అగ్రధానీ, అచార్జు, ఆదిగౌడ, కీర్తివ్యగౌడ, శ్రీగౌడ, శుక్లవాలగౌడ బ్రాహ్మణులను వారునుగలరు. వీరు మత్స్య మాంసములను భుజించుటయే గాక మధువును (మధ్యము) స్వీకరింతురు.

ఉత్కళ బ్రాహ్మణులు వీరిలో అగ్రభక్ష, ఆచార్య, కారా కోటకీ, ఘూటియా, తేలీ, రాజపండా, దేవతాపండా, నంద, నిశంక, హెూలీ, శతపత్రీ, శిష్టకారో, సాంతో, మొదలగు పేర్లుగల బ్రాహ్మణులు గలరు ఉత్కళులనే బ్రాహ్మణులను ఓఢ్రు లందురు. వీరికి మాతృభాష ఓఢ్రభాష, వీరు కాంస్యపాత్రలందు భుజించుటయేగాక మత్స్య మాంసాదులను భుజింతురు. గోపాలక (గొల్లవారి) నాపిత (మంగలివారి) యొక్క చేతి ఉదకమును స్వీకరించెదరు.

మైథిల బ్రాహ్మణులు-వీరిలో ఒజ్ఝు, ఠాకూరు, పహరిస్త్, రాయ, శ్రోత్రియులను పేరుగల బ్రాహ్మణులు గలరు. ఈమైదిల బ్రాహ్మణ తెగవారందరును మత్స్య మధ్యముల స్వీకరించుదురు. (ఇప్పు డిపుడు మానుకొను చున్నట్లు జనులలో వాడుకగా నున్నది.)

ఆదిగౌడ బ్రాహ్మణులు-వీరిలో కొందరు ఆమిషాహారము (మాంసాహారమును) వర్జించినట్లు తెలియుచున్నది. కొందరు ఆమిషాదుల గ్రహించుతూ శక్త్యుపాసకులై యున్నట్లును తెలియుచున్నది. (ఆంధ్రవాచ స్పతీయము పుట 655)

ఉపాధ్యాయ బ్రాహ్మణులు వీరు యజుర్వేదులు. వీరు కృషిచే జీవించువారు వ్యవసాయముచే బ్రతుకువారు పిఙ్ఞు బ్రాహ్మణులు వీరు శుక్ల యజుర్వేదీయులు. మాధ్యందిన కాణ్వ శాఖీయులు, మరి శాక్తేయులు-కాళీ దేవతను ఉపాసించువారై యున్నారు ఔదీచ్య బ్రాహ్మణులు. వీరు మూడు తెగలుగలవారై యున్నారు. 1 సిద్ధిపురి ఔదీచ్యులు, 2 సింహోరా ఔదీచ్యులు, 5 తొల్క్యయా ఔదీచ్యులు, వీరిలో ఒకరితో మరొకరు సంబంధ బాంధవ్యములు జేయరు. (ఆం॥ వా॥ పుట 664)

గోముఖ బ్రాహ్మణులు వీరిని గోళక బ్రాహ్మణులనియు అందురు. వీరి తల్లి మాత్రము వితంతువు. (ఆం॥ వా॥ పుట 1124) మరియు తపోధను బ్రాహ్మణులనువారును గలరు. వీరు సూరతు దేశమున తపతీనదికి సమీపమున నుండువారు. వీరు శివాలయములందు పూజారులుగనుండి శివార్పిత ద్రవ్యమును భుజించు చుందురు. మరియు భూమిని సాగుచేసియుకూడ జీవించెడివారై యున్నారు, వీరు ఋగ్వేదులు, (ఆం॥ వా॥ పుట 1352)

దధీచి బ్రాహ్మణులనువారు ఋగ్వేదులు, వీరిలో కొందరు గురువులుగను, మరికొందరు పేరు బెట్టెడివారుగను, యింకా కొందరు యాచకులుగను నున్నారు. జ్యోషీలనువారు శుక్లవాల్ల

గౌడ బ్రాహ్మణులలో నొక తెగవారుగను నున్నారు. అనావలులను బ్రాహ్మణులు నున్నారు. వీరికి వ్యవసాయమే ముఖ్యవృత్తి.

అగ్రభక్షణ బ్రాహ్మణులు. వీరు ప్రేత శ్రాద్ధములయందు దానముల పరిగ్రహించువారలై యున్నారు. అగ్రదానీ బ్రాహ్మణులు వీరును పైవారి వలెనే ప్రేత శ్రాద్ధములయందు దానములు పరిగ్రహించువారలై యున్నారు.

కర్హాడే బ్రాహ్మణులను నొక తెగవారున్నారు. వీరు వ్యభిచారమువలన బుట్టినవారు. వీరు దేవతలయెదుట అన్నముతో పాటు మనుష్యులను బలిదానము లిచ్చెడి బ్రాహ్మణులై యున్నారు (స్కంధ పురాణము సహ్యాద్రి ఖండం)

దేశస్థ బ్రాహ్మణులను నొకతెగవారున్నారు. వీరు నీచజాతి దాసిస్త్రీ వలన బుట్టినవారై యున్నారు. (బ్రాహ్మణోత్పత్తి మార్తాండము)

బ్రాహ్మణులను వారిలోని బేధములను వారి సమాచారములను గూర్చియొక వార్తా పత్రిక అనగా "పూనాసుధారక్" 1901 సం॥ రం జనవరి 1 వ తేదీన యీక్రింది విధముగ ప్రకటించి యున్నది మహారాష్ట్ర దేశమందలి బ్రాహ్మణులను వారిలోని బేధముల, కర్ణాటక, మద్రాసు ప్రాంతములందలి వారిలో అంతగా లేవు. గుజరాతి దేశమందలి వారిలో మిక్కిలిగా గలవు. వంగ, కాశ్మీరు దేశములందుండు బ్రాహ్మణులను వారిలో అనేక బేధములు కలవు. బ్రాహ్మణులను వారి యందరిలోను వేష, భాష, యాచారములు సమానముగ లేవు. బ్రాహ్మణుల యొక్క చరిత్రమును ప్రకటించితిమేని దానిని జూచి యెల్లరును సంతోషపడి యెదరేమొ ?

వంగదేశీయులు మాంసమును భక్షించెదరు. వారి గృహము లందు స్పర్శభేధములేదు. కాశ్మీర బ్రాహ్మణుల గృహములందు మహమ్మదీయులు గృహకార్యముల నిర్వర్తించెదరు. పంజాబు బ్రాహ్మణులు అంగీలు తలగుడ్డలు పెట్టుకొని మంచములపైన భోజనములు జేసెదరు. వారి వేషస్థితికి మహమ్మదీయుల వేష స్థితికి బేధము లేదు. వారిలో కొందరు మాంసము దినెదరు. కొందరు తినరు. కాశీయందు శూద్ర స్పర్శమునకు దోషములేదు. ఘూర్జర బ్రాహ్మణులు కాపువారి యిండ్లలో జలపానము జేసెదరు. బెల్గామ్, మలబార్ ప్రాంతములందలి బ్రాహ్మణులు స్పర్శదోష మును మిక్కలిగా జూచెదరు. అదేధర్మమని తలచెదరు.

మలబారు నందలి నంబూద్రీ బ్రాహ్మణులు దాక్షిణాత్యుల భోజనముల జేయుదురు. వారిని మీసాల జంతువులను పేరుతో బిలుతురు. అదేశీయ బ్రాహ్మణులు నాయరు స్త్రీలతో రమించెదరు. రామేశ్వర సమీపమందు స్పర్శదోషము లేదు. మహారాష్ట్ర మందలి విధవలు తమభర్తలు చనిపోయిన తరువాత పది, పది రెండు సంవత్సరముల వరకు వపనము (తలబోడి) చేసికొనరు. నంబూద్రీ బ్రాహ్మణులలో జ్యేష్ఠుడు మాత్రము పెండ్లి జేసుకొని తనభార్యతో నుండును. తక్కిన సోదరులందరు నాయురు స్త్రీలతో కాలము గడిపెదరు. ముల్పాడు. ఎల్లెడు నను నంబూద్రీలలో భేద జాతివారు వారి గృహములయందు శస్త్రక్రియలు జేసెదరు. వారి కిని నంబూద్రీలకును సంబంధ బాంధవ్యములు లేవు. మార్వారీ, శ్రీమాళీ, బ్రాహ్మణులను వారియందు నెవరు పౌరోహిత్యము జేసెదరో వారును, అట్లే సింధువార, సారస్వత బ్రాహ్మణుల యందును విధవా వివాహములను బూర్వకాలము నుండియు

జేసికొను చున్నారు. అనిల్వాడా పట్టణము నుండి మూలరాజ నుపేంద్రునిచే నుత్తర హిందూస్థానమునకు వేయి మంది బ్రాహ్మణులు పంపబడిరి. వారందరు ఒకే శాఖవారైరి. వారిని ఔదీచ్య సహస్రులందరు. గుజరాతులలో నొక్కొక తెగయందే భిన్న వేదములు పఠించెదరు. వారిలో కొందరు ఒకరి నొకరు వివాహముజేసి కొనియెదరు. ద్రావిడాంధ్రులలో నిట్టి బేధమును గొందరు పాటించరు. గుజరాతు దేశమునకు గౌడులు గొందరు వచ్చిరి. వారు మాంసమునుదినుటను త్యజించిరి. కొన్నాళ్లు గుజరాతులో నిలచిరి. వారు పంచగౌడులలోని వారా? పంచ ద్రావిడులలో జేరినవారా? యని విచారింపబడిరి. కొందరు షట్కర్మలలోని ప్రతి గ్రహమును గ్రహించిన వారిని బహిష్కరించెదరు. అస వాల బ్రాహ్మణులు గృహస్థుల యిండ్లలో పౌరోహిత్యముల నిర్వర్తించెదరు. వారు జైనులకు గురువులయ్యెదరు.

పంజాబులోని గౌడ సారస్వత బ్రాహ్మణులు ఇతర జాతి స్త్రీలను వివాహముజేసి కొనియెదరు. పంజాబులోని కొందరు గౌడ బ్రాహ్మణులు విధవలను వేశ్యలవలె జూతురు.

సింధు రాజపుత్ర దేశములోని బ్రాహ్మణులు మాలాకార, నాపిత (మంగలి) గృహములలో భోజనములు జేసెదరు. ఇట్టి వీరికి బ్రాహ్మణ్యము కలదా? ఢిల్లీప్రాంత బ్రాహ్మణులలో స్త్రీలు పురుషులతో సమానముగ వ్యవసాయము జేయుదురు. మార్వాడీ దేశీయాచరణ బ్రాహ్మణులకు రజపుత స్త్రీలను వివాహము చేసుకొను పద్ధతి కలదు. నేపాళీయ బ్రాహ్మణులలోని విధవలు వేశ్యలవలె ప్రవర్తించెదరు. పురుషులు శూద్ర స్త్రీలను వివాహము జేసుకొనియెదరు. వారి సంతానము

క్షత్రియులని వ్యవహరించెదరు. వంగదేశములోని భంగకులీన బ్రాహ్మణులు బవరు స్త్రీలను వివాహము జేసికొనియెదరు. వారిలో నొక్కొక్కరు పది, పదునైదు, ఇరువది మందిని కూడ స్త్రీలను వివాహము జేసికొనియెదరు. ఒరిస్సా దేశమునందలి బ్రాహ్మణులు శూద్రుల ఇండ్లయందన్నమును తిందురు. ఇట్టి భేదములనేకములు గలవు. ఈ విషయమంతయు "పూనా సుధాకర్" అను పత్రిక 1-1-1901 తేదీగల మహారాష్ట్ర భాషలోనుండి ఆంధ్రీకృతము చేయుబడినది.

మరియు హిందూ మహాయాగము 5 వ కూర్పు 1910 సం॥రము నందలి గ్రంథము 235 పుటలోనున్న విషయము గొంత గమనించుదము. "పశ్చిమ సముద్రమునంటుకొని సతారాయొద్ద నుండి కన్యాకుమారీ వరకు పడమటి కనుమలకును సముద్రమునకు నడుమనున్న భూభాగమంతయు పరశురాముడు సముద్రునివద్ద నుండి సంపాదించిన భూమియని నొక పౌరాణిక గాథ కలదు. అనగా నచ్చట మొదట సముద్రముండెననియు, దరువాత క్రమముగా భూమి యేర్పడెననియు నర్థము. ఈ భూభాగమంతటికిని సప్తకొంకణ మనిపేరు కొంకణములలో నత్యంత దక్షిణమున నున్న కేరళము దానికి నుత్తరమున నున్న తుళువ దేశము ఇవి రెండును చేర రాజ్యములోనివై యుండెను. ఈ దేశములోని ఆచార వ్యవహారములు అతి చిత్రములైనవి. ఇచట నితర జాతివారు గాక నంబూద్రీ బ్రాహ్మణులనువారును నాయరు లనబడు శూద్రులును విశేషముగ నుందురు. నంబూద్రీ బ్రాహ్మణుల కుటుంబములో పెద్దకొడుకు తప్ప ఇతరులు వివాహ మాడరు. నాయరు స్త్రీల నుంచుకొని

సంసారము జరుపు కొనియెదరు. నాయరు స్త్రీలకు వివాహము లేదు. ఈ నాయరు స్త్రీలు ఇష్టము వచ్చిన పురుషులతో యిష్టము న్నంతకాలము భార్యవలె నుండెదరు. ఇష్టము దీరినవెంటనే మరొకరిని చేపట్టుదురు ”

ఆంధ్రుల చరిత్ర 2 వ కూర్పు 1910 సం॥రపు గ్రంథము 176 పుట యందు చిలుకూరి వీరభద్రరావు గారిట్లు వ్రాసి యున్నారు. ఒక్క ఆర్యజాతి వారిచే మాత్రమే వర్ణాశ్రమ బేధములు గలిగింపబడినవి. కాని యనార్యులైన నాగులలోను, మిశ్రమ జాతులవారైన బౌద్ధులలో నీబేధము కల్పింపబడి యుండలేదు. ఆర్యులలోనైన నిప్పటి రీతివర్ణ బేధములు గానరావు ఆ కాలమునందు వృత్తులనుబట్టి కులబేధము లేర్పడినవి. కాని కులబేధములనుబట్టి వృత్తులేర్పడి యుండలేదు. ఆ కాలమందు భోజన ప్రతి భోజనములకు ప్రతి బంధకము లేవియు నేర్పడి యుండలేదు. బ్రాహ్మణుడను వాడు చాతుర్వర్ణములలోని స్త్రీలను వివాహమాడుటకు నధికారము కలిగియుండెను. ఇట్టి యధికారమును బ్రాహ్మణుడనువాడు గలిగియుండుటకు కారణము లేకపోలేదు. ఆకాలము నందప్పుడు బ్రాహ్మణులని పిలువబడువారు దక్షిణా పథమున మిక్కిలి తక్కువ జనసంఖ్య గల వారుగనుండిరి. ఇతర జాతులలోని స్త్రీలను వివాహ మాడకుండినచో వారి సంఘమభివృద్ధి గాంచనేరదనియు శీఘ్రకాలములోనే అంతరించి పోవెననియు యట్టి నిర్ణయమేర్పరచు కొనిరి. అంతేగాక స్వరక్షణార్థమై బ్రాహ్మణేతరులగు నితర జాతులవారిని గూడ బ్రాహ్మణులుగా చేయుటకు మార్గము లేర్పరచుకొని నితర జాతివారిని గూడ బ్రాహ్మణులుగా జేయుటయేగాక యితర జాతి

కన్యలనుకూడ వివాహములుజేసికొను చుండిరి. అప్పటికింకను బ్రాహ్మణులు మాంసభక్షకులుగానే యున్నందున శూద్రాదులు చేసిన వంటకాదులు భుజించుటకు సంకోచించుచుండిరి. కాని ? బౌద్ధమతాచార్యుల యొక్కయు, జైనమతాచార్యుల యొక్కయు బోధనలచేతను, ఆచరణ విధానములచేతను బ్రాహ్మణుల పిత్రు కార్యములందు (శ్రాద్ధములయందు) సైతము మాంస భోజనము వర్జించిరి. (వైష్ణవ బ్రాహ్మణులను వారిలోని కొన్నితెగలు యిప్ప టికిని వర్జించలేదు.)

బ్రాహ్మణు లనబడువారు మాంసమును కొన్ని తెగలు వర్జించినవంటే యీ గౌరవము విశేషముగ బుద్ధమతమునకు జైన మతమునకు జెందవలసియున్నది. అహింసయే పరమ ధర్మమని బోధించిన బుద్ధుని మతమును అశోకవర్ధనుడు ప్రకాశం జేసెను. ఆ అశోకుని సందేశమును ఆంధ్రులు శిరసావహించిర. వీరి ప్రేర ణచేతను, సమీపస్థులగుటచేతను ద్రావిడ దేశమునందలి వారు కూడ మెల్ల మెల్లగ మాంసభోజనమును వర్జించునట్లు చరిత్ర వలన దెలియుచున్నది. నేడు పంచ ద్రావిడులను వారిలోనివారు మాంసము ముట్టరు. దాక్షిణాత్యులలోని పంచగౌడులను బ్రాహ్మ ణులు యిప్పటికిని మాంసమును వర్జింపలేదు. ఔత్తరాహులలోని బ్రాహ్మణులకు దమపూర్వులు ఒక కాలమున మాంస భోజనము జేయుచుండిరను విషయమే దెలియదు. బహుకాలము క్రిందటనే యీ దురభ్యాసమునుండి దూరమైనారు. ఆర్యుల కాలమున పరి పాలన కర్తలుగానుండిన ఆంధ్రులను కేవలము శూద్రులుగా జూచియుండక పోయినను క్షత్రియులనిపేరు గలవారికి మాంస సురాపానాది మత్తు పదార్థములను నిషేధింపలేదని చెప్పుచుండి

నను అంతరంగమందు ద్వేషభావముతోనే ఆర్యులు యుండిరి. మొదటనామ మాత్రముగ యేర్పడిన వర్ణాశ్రమ బంధములు అంతగట్టిగా లేకపోయినను కాలము గడచినకొలది స్వార్థపరులచే బహుకఠినముగా బిగింపబడుచు వచ్చినటుల దెలియుచున్నది.

మనుస్మృతి కాలమునకు కల్పితములన్నియు క్రోడీకరించి స్వాభావిక ధర్మములకు విరుద్ధముగా రూపొందించి స్థిరపరచిరి. అందుచే యీకల్పిత ధర్మములన్నియు విశ్వసింపదగినవి కావని యీనాటికిని కొందరి పెద్దల నిశ్చయమని తెలియుచున్నది. ఇట్లే తక్కిన జాతులలోను అవాంతర బేధములు కల్పించినట్లు అగు పడుచున్నది.

సోదరులారా! పాఠక మహాశయులారా!! ఇప్పటికి యీ కల్పిత జాతులయొక్క ధర్మములు, బేధములు అంతర్భేధములు అనేక గ్రంథముల యొక్క ఉదాహరణలచే దెలిసికొంటిరి గదా! బ్రాహ్మణులనువారిలో సుమారు 1886 బేధములు గలవనియే తోచుచున్నవి శిల్ప బ్రాహ్మణులగు సానగాది పంచ బ్రహ్మఋషుల సంతతివారు విశ్వ బ్రాహ్మణులు, విశ్వకర్మ బ్రాహ్మణులు, పాంచల్ బ్రాహ్మణులు, బ్రహ్మ పంచాల్ బ్రాహ్మణులు, శివ పంచాల్ బ్రాహ్మణులు, దేవ పంచాల్ బ్రాహ్మణులు, దైవజ్ఞ బ్రాహ్మణులు, దేవాగ్ని బ్రాహ్మణులు, ఉపపంచాల్ బ్రాహ్మణులు, మను పంచాల్ బ్రాహ్మణులు, మయ పంచాల్ బ్రాహ్మణులు, త్వష్ట పంచాల్ బ్రాహ్మణులు, శిల్పి పంచాల్ బ్రాహ్మణులు, దైవజ్ఞ పంచాల్ బ్రాహ్మణులు, జాంగిడ బ్రాహ్మణులు ,ధీమాన్ బ్రాహ్మణులు, టాంక్ పంచాల్ బ్రాహ్మణులు, కర్మార బ్రాహ్మ ణులు మొదలగు పేర్లులతో పిలువబడువారు 86 తెగలుగల

వారుగ నున్నారు. వారు వేదముల బఠించి శిల్పవిద్యల యందు నేర్పరులై కులశ్రేష్ఠులునగు విశ్వబ్రాహ్మణుల సంతతివారని సమస్త వేదోపనిషచ్ఛాస్త్ర పురాణేతి హాసములయందు పరిశీలించిన అధునిక పండితోత్తములగు చరిత్రకారులచేతను, న్యాయమూర్తులచేతను, ప్రభుత్వాధికారులచేతను, నిర్ణయింపబడినది మరియు శిల్పి బ్రాహ్మణులను విశ్వకర్మ బ్రాహ్మణాదులెల్లరు స్వజాతి స్త్రీలను ధర్మబద్ధముగా వివాహమాడిన వారికి బుట్టిన బ్రహ్మర్షుల సంతతి వారగుటచేత జాత బ్రాహ్మణులనియు, వసిష్ఠాదుల సంతతివారగు 1886 తెగలవారు వేరు వేరు జాతి స్త్రీల యందు వేరు వేరు జాతి పురుషులవలన బుట్టిన ఋషుల సంతతి వారలు విప్రులనియు, ద్విజులనియు, గోబ్రాహ్మణులనియు, తెలియుచున్నది. ఇందులకొక దృష్టాంతరము జూపుచున్నారము.

సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులగు శ్రీయుత రాజేంద్రలాల్ మిత్రగారిచే వ్రాయబడిన హిందూ ఆర్యులు అను గ్రంథమున "విశ్వకర్మ వర్ణము (జాతి) వైదిక సంతతినుండియే వచ్చినది. వారు ఆదిమ (మొదట) బ్రాహ్మణులగుటయే గాక నిస్సందేహముగ బ్రహ్మత్వమును పవిత్రతయును గలిగినవార"ని వ్రాయబడి వున్నది.

మరియు సేలం జిల్లా అను హిందూదేశపు వక జిల్లా (జే. డబ్ల్యూ డైకాస్) గారిచే 1853 వ సంవత్సరము ప్రచురించిన గ్రంథమున 10వ పేజీయందు బంగారము, ఇనుము, కఱ్ఱ, ఇత్తడి మరియు రాతి పనులు ఆచార్యులచే చేయబడుచున్నవి. అని వ్రాయబడివున్నది. ఇంక తమిళ-అంగ్ల నిఘంటువు డాక్టర్ విండుస్లో గారిది 1862 మరియు మద్రాస్ ప్రెసిడెన్సి (వ్యవస్థా)

పరిపాలనా పుస్తకము డాక్టర్ న్యూక్లియన్ గారిది 3వ సంపుటము గ్లాసరీ నిఘంటువు (1893) వీటియందు ఆచార్యయను పదము ద్రావిడ శబ్దమున అచారి పదమున కన్వయించును. దీని కర్థము శిల్పకారి యగును. యీ శబ్దము విశ్వబ్రాహ్మణుల కుపయోగింప బడుచున్నది. అని యుండుట వలన విశ్వబ్రాహ్మణులు ఇనుము, కఱ్ఱ, ఇత్తడి. రాయి, బంగారు పనులు చేయుచుండిరనియు, వారికి ఆచార్యయను పదము కు ల బి రు దు గా ను, (వృత్తి బిరుదుగా) యుండెనని కూడా వ్రాసియుండిరి.

ఇంతే గాదు మఱియు బొంబాయి రాజధాని ప్రభుత్వ మాస పత్రిక (గజిటర్) సోలాపూర్ 124-134 పేజీని చూడుడు. పంచాలురు (విశ్వబ్రాహ్మణులు) అయిదు తరగతులుగ విభజింప బడియున్నారు.

స్వర్ణకారులు (బంగారపు పనిచేయువారు) తామ్రకారులు (రాగి, ఇత్తడి పనులు చేయువారు) లోహకారులు (ఇనుము పని చేయువారు) ధారుకారులు (కఱ్ఱ పని చేయువారు) శిల్పులు లేక శిలాకారులు (ఱాతి పని చేయువారు) వీరికి అయిదు ముఖ్య గోత్రముల నుండి మొత్తం 125 గోత్రములు గలవు. వారు ప్రపంచ సృష్టి కారకుడగు విశ్వకర్మ సంతతి వారమని చెప్పుదురు. వారి వంశము వారికి ధర్మాధికారి, మహాముని, పండిత, వేదపాఠక మరియు దీక్షితయనునవి బిరుదులు. వారు మత్స్య మాంసాదుల భుజింపరు. సురా మధ్యములను సేవింపరు. వారు స్నానము జేయకయు, గృహ (కుల) దేవతల పూజింపకయు వండిన యన్నమును దేవతలకు నైవేద్యముగ సమర్పింపకయు నెన్నడును భుజింపరు. వారు బ్రాహ్మణ వేషమును ధరింతురు.

వీరు గో బ్రాహ్మణులను మరొక తెగవారిచేత అన్నమును నీరును గ్రహించుట లేదు. పాంచాలురును (విశ్వబ్రాహ్మణులు) బ్రాహ్మణత్వముగల స్త్రీ పురుష దేవతల నారాధింతురు. వారి పురోహితులు స్వజాతి వారుగనుండి మిక్కలి గౌరవనీయులుగను పూజింపదగిన వారు నుందురు. వారు సర్వ సాధారణముగ బ్రాహ్మణ పర్వదినములయందు ఉపవాసములుందురు. వారు తమ బాలురకు ఏడు లేక తొమ్మిది సంవత్సరముల ప్రాయము గల వారుగ నున్నప్పుడే ఉపనయనముచేసి యజ్ఞోపవీతములు వేసి వేదపఠన మొనరింపజేతురు. బాలికలను 8 లేక 12 సంవత్సరముల ప్రాయము నందును, బాలురకు యెనిమిది నుండి 25 సంవత్సరములకు లోపలను వివాహములు జేతురు. వారు మృతి చెందిన వారికి పదమూడు దినములవరకు శ్రాద్ధ కర్మ జరుపుదురు. అని వ్రాయబడియున్నది.

బాంబే లా (బొంబాయి ధర్మశాస్త్రపు నివేదిక 2 వ భాగము) శంకర్‌సేట్ దత్త స్వీకార వ్యాజ్యమునందు గౌరవనీయులగు మిష్టర్ ప్యారన్ న్యాయాధిపతిగారు బ్రాహ్మణ ధర్మసూత్రములు దైవజ్ఞులకు (విశ్వబ్రాహ్మణులకు)ను అచరణీయములుగ నున్న వని తీర్పు చెప్పియున్నారు.

పాఠకులారా! వెనుకటి పుటలలో "బ్రాహ్మణులు వారి బేధములు, బ్రాహ్మణు లెవరు?" అను విషయమును గురించి సాంగో పాంగముగ వేద వేదాంగ పురాణేతి హాసములే గాక చారిత్రముల యందలి విషయములను, రాజకీయ తీర్పులవల్లను పాలకులు ప్రకటించిన గెజెటులవల్లను. పరిశీలించగా నెగ్గు తేలినది, విశ్వకర్మ బ్రాహ్మణులు బ్రాహ్మణజాతికి చెందినవారనియు.

బ్రాహ్మణ కులమువారని పిలువబడు వారిలో మొదటివారనియు, యజన, యాజన, అధ్యయన, అధ్యాపక, దాన, ప్రతిగ్రహ షట్కర్మ నిరతులనియు, వివాహాది షోడశకర్మాధికారులనియు, రుజువైనది కదా! సాంఘీకాది పద్ధతులయందే గాక ఇండియా ప్రభుత్వమువారి జనాభా రిపోర్టునుబట్టియు విశ్వబ్రాహ్మణులు సదాచార సంపన్నులనియు ఆచార వ్యవహారములయందు బ్రాహ్మణ ధర్మ మనుష్టించువారనియు, మత్స్య, మాంస, మధ్య, సురాపానాది దురలవాట్లు గలవారుకారనియు, సాత్వికమగు శాఖాహారులనియు దెలియుచున్నది. ఇట్లనుటలో విశ్వబ్రాహ్మణ జాతి వారలకంటే ఇతర జాతులవారందరు తక్కువ జాతివారనియు, నీచులనియు మేమనుటలేదు. భారతదేశము నందలి అన్ని జాతులు సమానములేయని భావించు నీ యిరువదవ శతాబ్దము నందు అట్లనుటకు నెవరికి హక్కులేదు

ఇక బ్రాహ్మణ శబ్దాధిక్యతను గురించి కొద్దిగా జెప్పి ముగించుచున్నాను. ఇప్పటికైనా పూర్తి వివరములు దెలుసుకొని తాబట్టిన కుందేటికి మూడేకాళ్లని వాదించు మూర్ఖులు యీక్రింది విషయములను గుర్తించి తమ శఠత్వమును వదలుకొని విశ్వబ్రాహ్మణులును, బ్రాహ్మణునులనువారును తక్కినవారును సమర దృష్టితో సహకార స్నేహభావముతో మెలంగ గలరని ఆశించు చున్నాడను.

మహాశయులారా! లోకంబున బ్రాహ్మణు లనందగిన వారిలో జగత్ప్రాధాన్యులైన సద్బ్రాహ్మణులు. "బ్రాహ్మణోస్య ముఖమాసీ"త్తను వేదవాక్యము ననుసరించి బ్రహ్మ ముఖము నందు బుట్టినవారే బ్రాహ్మణులని నిశ్చయింప వచ్చును.

బ్రహ్మజ్ఞానము వలన బ్రాహ్మణులైనారనుటలో నానాజాతి వారు సైతము బ్రాహ్మణులు గావచ్చును. జగత్తంతయు బ్రాహ్మణు లేయనుటలో బ్రకృతి చర్యకు నడ్డుకాబోవుచున్నది. కాబట్టి పుట్టు బ్రాహ్మణులే బ్రాహ్మణులుకాని పెట్టు బ్రాహ్మణులు బ్రాహ్మణులుకాజాలరు అయితే ఇందులో నొక పొరపాటగుపడు చున్నది. ఏమన ముందు బ్రహ్మ పంచ ముఖుడనియు, తర్వాత శివుడతని తల నొకదానిని నుత్తరించి నందున చతుర్ముఖుడైనా డనియు పురాణ ప్రసిద్ధము దానింబట్టి జూడ బ్రాహ్మణులైనవారు చతుర్ముఖుడగు బ్రహ్మ ముఖమునందు బుట్టినట్లు భాగవతాది పురాణములందు దెలియుచున్నది. ఇందువలన బ్రహ్మజగ దాదిన బ్రాహ్మణుల సృజింపక మధ్య చతుర్ముఖుడైన తరువాత బ్రాహ్మణుల సృజించినట్లును, మొదట అక్కరలేక పిదప అక్కరయొదవినట్లును దోచుచున్నది. కారణము లేక కార్యము డయింపదు. మొదలలేని యక్కర తర్వాత కలుగుటకు హేతు వెయ్యది యను విషయమును యెవ్వరును వ్రాశినవారు లేరు. అది యట్లుండనిండు-బ్రహ్మదేవుడు మధ్య చతుర్ముఖుండై బ్రాహ్మణుల సృజించినాడన్న ఆ బ్రహ్మ తనముఖ సంఖ్యకు వర్ణ సంఖ్య సరిగానుండగా బ్రాహ్మణులను వారినొక్కరిని మాత్రము ముఖము నందుద్భవింపజేసి మిగత త్రైవర్ణికులను బాహూర్వాం ఘ్రులు జనింపజేయు కారణంబెద్దియో తెలియదు. అట్లు చేసినా డనినను ఇప్పుడు చాతుర్వర్ణంబులకు నుండెడు న్యూనాధిక్యతలం బట్టి జూడ నివ్విషయమునందు పక్షపాతంబు గోచరింపక పోదు. తండ్రి బిడ్డలయందు బక్షపాతియగుట వైపరీత్యము. బ్రహ్మ సాక్షాత్ విరాట్టు నందుద్భవించిన వాడగుటచే అతనికి తండ్రి

గుణము లలవడి యుండును. "యస్మాద్బీజ ప్రభావేన తస్మాద్బీజ ప్రశస్యతే" ఎట్టి బీజమునకు బుట్టిన వృక్షము ఆబీజ వృక్షమునకుగల గుణములుగల చెట్టుయే యైయుండునను ప్రమాణము గుర్తింపవలసి యున్నది. ఆ విరాట్టు సమరస జ్ఞాన సంపన్నుండుకాని బేధ జ్ఞాన సంపన్నుడుకాడు.

బ్రహ్మ విష్ణునాభి కమలమం దుద్భవించిన వాడగుటచే బ్రహ్మకు బ్రాహ్మణత్వము లేదు సరికదా! ఇట్టి బ్రహ్మకు ముఖమునం దుద్భవించినవారికి బ్రాహ్మణత్వమెట్లు వచ్చును? బాహువులయందును, ఊర్వులయందును పుట్టినవారికి ద్విజత్వము ఎట్లు వచ్చినది? పాదములయందు పుట్టిన శూద్రులకు ద్విజత్వమురాని కారణమేమి? పాదములయందు పుట్టిన శూద్రులకు ద్విజత్వము రాదనే విషయము నిశ్చయమే అయితే "అరవింద సంభవు డంగుష్ఠమున, దక్షు డూరువువలనను, నారదుండు-నాభి, బులహుడు గర్ణముల, బులస్త్యుండు త్వక్కు, నభృగువు హస్తమున, గ్రతువు-నాస్యంబు వలన, నయంగిరసుడు ప్రాణమున, వసిష్ఠుడు మనమున, మరీచి-గన్నుల, నత్రియుగా పుత్ర దశకంబు గలిగిరి." అని శ్రీ మదాంధ్ర భాగవతమున తృతీయ స్కంధము నందు 377 వ పద్యమునందు చెప్పిన ప్రకారము బ్రహ్మదేవుని కాలి బొటనవ్రేలి యందు దక్షుడును, ఊరువునుండి నారదుడును, నాభిన బులహుండును, గర్ణముల బులస్త్యుండు, త్వక్కున భృగువు, హస్తమున గ్రతువు, యీ విధము గా అంగాంగముల బుట్టిన వారికి అనేక జాతులు రావలసి యుండగా వీరికి అట్లురాక పోవడమేమి? పాదాంగుష్ఠమున బుట్టిన దక్షునకు బ్రహ్మత్వము గలుగుట చిత్రము గాదా!

అట్లుగాక జాతుల పుట్టించిన బ్రహ్మ ఒకడును ఋషులబుట్టించిన బ్రహ్మ మరొకరా? యీ విషయము మేమే ముఖముయందు పుట్టినారమని చెప్పువారలే తేల్పవలసి యున్నది.

సకల జగత్సృష్టి కర్త చతుర్ముఖుండు గాడనియు సృష్టి కర్తకు విరాట్టని పేరుండినట్లు వేదాది గ్రంథములయందు గన్పట్టు చున్నది. (విరాట్) 'వి' ఉపసర్గ పూర్వకమగు రాజృదీప్తౌ అను ధాతువుతో 'కిప్' ప్రత్యయము చేరుటచే "విరాట్" శబ్దము సిద్ధ మగుచున్నది. "యోవివిధం నామ చరాచరం జగద్రాజయతి ప్రకాశ యతిస విరాట్" బహు ప్రకారమగు జగత్తును ప్రకాశ పరచుటచే విరాట్ నామముచే బరమేశ్వరుడు గ్రహింపబడు చున్నాడు. (విశ్వకర్మ)..................విశ్వకర్మా మహాత్మా సదాజనా నాం హృదయే సన్నిష్టః (శ్వేతాశ్వతరో పనిపత్తు, చతుర్థా ధ్యాయం) విశ్వకర్మ మహాత్ముండై సకల జనులయొక్క హృద యములందు నిలచియున్నాడు. అని చెప్పబడియున్నది. మఱియు పురుష సూక్తమునందు "అద్భ్యః సంభూతః పృథివ్యైర సాశ్చ విశ్వకర్మణ స్సమవ ర్తతాధి తస్యత్వష్టా విదధ ద్రూపమేతి తత్పురుషస్య విశ్వమాజానమగ్రే॥ పురుష సూక్తం త్రయోదశో ఽను వాకః॥ ఇందులకు య॥ అ॥ విద్యా॥ భాష్యమునందు "యోఽయంవిరాడ్రూపో నారాయణాఖ్యః పురుషః సోఽయం "అద్భ్యః సంభూతః" సర్వాత్ర వ్యాప్తేషు జలేషు క్షీరమధ్యే మండవత్ బ్రహ్మాండ గోలక ముత్పన్నమ్" ..............."విశ్వ కర్మణః" జగత్కర్తు పరమేశ్వరాత్", 'అధిసమ వ ర్తత' అధిక్యేన నిష్పన్నః, యోయం బ్రహ్మాండాభిమానీచేతనః పుమాన్సోయ మీశ్వరాంశః 'తస్య' విరాట్పురుషస్య 'రూపం' చతుర్దశలోక

రూపావయవ సంస్థానం విదధత్, నిష్పాదయన్। 'త్వష్టా' విశ్వకర్మా జగదీశ్వరః, 'ఏతి' ప్రవర్తతే, 'పురుషస్య' విరాడాఖ్యస్య, సంబంధి 'తత్' విశ్వం, ప్రసిద్ధం-దేవమనుష్యాది రూపం సర్వం జగత్ 'అగ్రే' సృష్ట్యాదౌ 'అజానం' సర్వత్ర ఉత్పన్నమ్, అని చెప్పబడియున్నది మఱియు యిదే మంత్రమునకు రామానుజాచార్య భాష్యము చూడుడు. "— .........దేవతిర్యఙ్మనుష్యాది స్థావరాది సర్వ ప్రపంచశ్చ సంభూతః - సః ద్వివిధః-ప్రపంచః-విశ్వకర్మణః- అధిసమవర్తత- 'విశ్వం' ప్రపంచకర్మ యస్యః-విశ్వకర్మా - పురుషోత్తమః- విశ్వకర్మా మనస్త్వష్టేతి సహస్రనామ సూక్తం-తస్మాదధీశ్వరాత్-లోకతః-లోకేశ్వరాది విభాగత్వేన సంవృత్తః-ఏవం తస్య ప్రపంచ స్వరూపం విదధత్-త్వష్టా-సర్వ ప్రపంచకర్తా-ఇతి" అని చెప్పబడినది. మఱియు దయానంద సరస్వతీస్వామి వారి భాష్యమునందు "............విశ్వం సర్వం కర్మ క్రియమాణ మస్యస విశ్వకర్మాతస్య పరమేశ్వరస్య సామర్థ్య మధ్యే కారణాఖ్యేఽగ్రే సృష్టేః ప్రాగ్గతస్సమ వర్తత వర్తమానమాసీత్" అని చెప్పియుండుట వలన "విరాట్ విశ్వకర్మయే పరమేశ్వరుడని సమస్త ప్రపంచ సృష్టికర్తయని రూఢియగు చున్నది. నిర్వికారనిర్గుణ పరబ్రహ్మయగు నావిశ్వకర్మ సృష్టికారణ భూతుండై సాకారము దాల్చెను. అట్టి సాకారుండైన యావిశ్వకర్మ మహాపురుషుడు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష-ఈశానములను పంచ ముఖుండాయెను. యీ పంచ ముఖుండగు విశ్వకర్మ వలననే సర్వ ప్రపంచము లుద్భవమాయెను.

విశ్వకర్మ పురుషుని ప్రాగాది పంచముఖముల యందు సానగ, సనాతన, అభువనస ప్రత్నస, సుపర్ణులను పంచ బ్రహ్మర్షు లుద్భవించినట్లు, యజుర్వేదము (తైత్తరీయ సంహిత) చతుర్థకాండ తృతీయ ప్రశ్నయందు యీక్రింది మంత్రము వలన దెలియుచున్నది. "ప్రాచీదిశాం వసంతరుతూనా మగ్నిర్దేవతా బ్రహ్మద్రవిణం త్రివృథ్త్సోమస్సఉ పంచదశవర్త నిస్త్ర్యవిర్వయః కృతమయానాం పురో వాతో వాతస్సానగరుషిః-దక్షిణాదిశాం గ్రీష్మరుతూనా మింద్రోద్రేవతాక్షత్త్రం ద్రవిణం పంచదశ స్తోమస్స ఉ సప్తదశవర్త నిర్దిత్యవాడ్వ యస్త్రేతాఽయానాం దక్షిణా ద్వాతో వాతస్సనాతనరుషిః-ప్రతీచీదిశాం వర్షరుతునాం విశ్వే దేవా దేవతావిట్ ద్రవిణగ్ం సప్తదశస్తోమస్స ఉవెకవిగ్ంశవర్త నిస్త్రివథ్సోవయో ద్వాపరోఽయానాం పశ్చాద్వాతోవాతోహ భూనరుషిః-ఉదీచీ దిశాంగ్ శరదృతూనాం మిత్రావరుణౌ దేవతాపుష్టం ద్రవిణమే కవిగ్ం శస్తోమస్స ఉత్రిణవవర్త నిస్తుర్య వాడ్వయ ఆస్కందోఽయానా ముత్తరా ద్వాతోవాతః ప్రత్నరుషిః-ఊర్ధ్వాదిశాంగ్ హేమంతశశిరా వృతూనాం బృహస్పతి ర్దేవతా వర్చోద్రవిణం త్రిణవస్తోమస్స ఉత్రయస్త్రిగ్ంశ వర్తనిః షష్ఠవాడ్వయోఽభి భూరయానాం విష్వగ్వాతో వాతస్సుపర్ణ రుషిః-అనగా సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన్యములను పంచ ముఖములయందు "సానగ, సనాతన, అహభూన, ప్రత్నస, సుపర్ణస యను పేరుగల పంచ బ్రహ్మరుషులు జనించిరని పై వేద వాక్యము రుజువు చేయుచున్నది. యీ పంచ బ్రహ్మర్షుల వల్లనే ప్రపంచము యొక్క సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములను పంచ విధకృత్యములు జరుగుటయే గాక సర్వ జీవ

రాసుల జీవనోపాధికి అవసరములగు సర్వవస్తు సముదాయో త్పత్తికి అవసరమగు పంచ విధ శిల్పములు నిర్వర్తించుటకు మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞులను పంచ బ్రహ్మలు ఋగ్యజుస్సా మాథర్వణ ప్రణవములను పంచ వేదములు, అయో, దారు, తాంబ్ర, శిలా, స్వర్ణములను పంచ విధ శిల్పము లుద్భవించినట్లు వేదములు వేదాంగములు, శాస్త్ర పురాణేతి హాసముల యందు ధ్వనించుచున్నవి. ఈ కారణములచే సృష్టికర్తయగు పరబ్రహ్మ పంచముఖుడుగాని చతుర్ముఖుండుగాడని ఋజువైనది గదా! అట్టి పంచముఖ పరమేశ్వరునియందు జగదాదిన జగత్సృష్టి కొరకు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష ఈశాన్యములను నిజపంచ ముఖంబుల వలన "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" త్తనెడు ప్రమాణము రీత్యా "పూర్వానసత్సానగ, దక్షిణాస్సనాతన, పశ్చా దహభూన, ఉదీచ్యాం ప్రత్నః, ఊర్ధ్వాత్సుపర్ణః యను బ్రహ్మ లుద్భవించిరి. "పురుషస్యము ఖోద్భవ ప్పౌరుషేయః" పురుషుని ముఖము నందుద్భవించుటచే పౌరుషేయులనియు, పరబ్రహ్మయం దుద్భవించుటచే బ్రాహ్మణులనియు, పౌరుషేయ బ్రాహ్మణులనియు, ప్రపంచకర్మ నాచరించుటచే విశ్వ బ్రాహ్మణులనియు, అయో, దారు, తామ్రము, శిలా, స్వర్ణములను పంచ శిల్ప కర్మలచేయుటజే విశ్వకర్మలనియు "కర్మ బ్రహ్మస్వరూపంచ" సృష్టి స్థితి, లయ, తిరోధానుగ్రహము లనెడు బ్రహ్మ కర్మలు జేయుటచే విశ్వబ్రాహ్మణులనియు, దేవతా శిల్పములు జేయుటచే దేవ బ్రాహ్మణులనియు, శిల్పాచార్యులనియు, వాపీకూపతటాకారామ గృహాలయ ప్రాసాద గర్భమందిర మధ్య రంగ మహదాస్థాన మండప సాధాంతరాళ గోపుర ప్రాకా

రాదుల నిర్మాణకర్తలగుటచే స్థపతులనియు, శివ విష్ణ్వాది విగ్రహముల ఆగమోక్త ప్రకారము స్థాపించుటచే అగమాచారులనియు, సౌమ్య. విద్యాధర, స్యందన, గంధర్వ. కాంత, కుసుమ, గంధర్వ, పుష్పకాది రథ నిర్మాణకు లగుటచే రథకారులనియు, రథకార బ్రాహ్మణులనియు, పరమేశ్వరుని పంచ ముఖముల యందుద్భవించిన వారగుటచే పంచాననులనియు, నఖిలవర్ణాశ్రమాచార ధర్మ ఖర్మంబులకు నాడి గురువులగుటచే జగద్గురువులనియు

శృతిస్మృత్యర జాతేషు విశ్వకర్మాని గద్యతే।
విశ్వంచ కారయత్తస్మా ద్విశ్వకర్మా జగద్గురుః॥
మూలస్తంభ పురాణము ద్వితీయాధ్యాయం॥

శ్లో॥ ధర్మార్థ కామమోక్షాణా మాచార్యో వేద పారగః।
ఏతత్క్రర్మ మహామూర్తి ర్విశ్వకర్మా జగద్గురుః॥

(స్కంధ పురాణ నాగరఖండము విశ్వకర్మో పాఖ్యాన షష్టాధ్యాయము 25 శ్లోకం॥)

ఇట్లు సార్థక నామంబులచే పేర్కొనంబడి విశ్వకర్మీయులు బ్రాహ్మణ శబ్దవాచ్యులైనట్లు తెలియుచున్నది.

"విశ్వకర్మా మనసా విశ్వం" బను ప్రమాణము ననుసరించి ఎవని మనస్సునుండి విశ్వము కల్పింపబడినదో, యెవరు జగదాధారులో, ఎవరు జగదుత్పత్తి స్థితి, లయకర్తలో యెవరు జగల్లక్ష్మికి పంచ ప్రాణంబులో వారుకదా బ్రాహ్మణులు.

బ్రహ్మండాల వాలంబున స్వకీయ బుద్ధిచే బీజంబును నాటి యంకురింపజేసి కృపారస సేచనంబుల జగద్రుమంబును శాఖోప శాఖలుగ విస్తరింపజేసి నానాటికి మహోన్నస్థితికి రప్పించిన వారెవరో అట్టివారు కదా బ్రాహ్మణులు.

తమ తండ్రి సంపాదించిన స్వల్పాస్తిని తమ కుమారులు కోటాన కోట్లుగ అభివృద్ధి గావించిన చందమున బ్రహ్మ నిర్మితంబైన యల్ప సృష్టిని కాలక్రమంబున విస్తరింపజేసిన వారెవరో వారుకదా బ్రాహ్మణులు.

ఎవరి కృత్యంబులు ప్రపంచక సహాయ కృత్యంబులో ఎవరి చేతలు జగజ్జీవ నాధారంబులో ఎవరి యూహలు సర్వ లోకోద్ధరణంబునకు జన్మభూములో యెవరి చతురత అఘటనా ఘటన సమర్ధతలకు గారణ యాచులో యెవరి మానసములు సృష్టి కుశలతాల తాలవాలంబులో యెవరి ఓర్పులు లోకరక్షణ భార భరణమునకు శేషమూర్తులో అట్టివారు కదా బ్రాహ్మణులు.

ద్విజులు జాతకర్మాది షోడశకర్మలచే సంస్కరింపబడి యజ్ఞ, యాగాది కార్యంబుల స్రుక్స్రువయూప పాత్రాసనా శరణ్యద్యుప కరణంబులబడసి షడ్రసో పేతాన్నంబుల సంతృప్తులై దక్షిణ తాంబూలాదులచే గౌరవనీయులై సుఖతరంబగు యాచనావృత్తి నవలంబించి ఎద్దులుచేయ గుఱ్ఱంబులు దినెనను లోకోక్తి ననుసరించి యన్య జనకష్టార్జిత ధన ధాన్యాది పదార్ధములచే సుఖ జీవనంబులకు నెవరు కారణకర్తలో వారుకదా బ్రాహ్మణులు.

సకలాస్త్ర శస్త్ర ఆణ్వాస్త్రాదియుద్ధ సాధనంబులం బడసి సకల శత్రువుల జయించి చతుస్సముద్ర వలయితంబైన భూవలయంబేలుచు రత్నకాంచన నిర్మితమకుట కేయూర హార కంకణ ముద్రి కాంగుళీయ నానా భూషణంబులును, వస్త్రగంధ మాల్యానువేపనాది బహువిధ వస్తు విస్తారంబులును, రధాంధోళిక ఛత్ర చామరంబులును, గండపెండేరాది బిరుదులును, ప్రాకార పరి

ఘట్టాలక గోపుర ప్రాసాద సౌధహర్మ్య గృహద్వార కవాటాదులచే రమణీయంబైన రాజధానులు గలిగి రాజులెవరి కృత్యంబులచే సార్వభౌమాది నామంబులు గాంచు చున్నారో వారు కదా బ్రాహ్మణులు.

కోమటులు పడి, పావు, చిట్టి, చెటాకాదిగా కొలత పాత్రలను, సేరు, అర్ధసేరు, పావు మొదలుగా తూనిక రాళ్లను, త్రాసు, తక్కెడ, ఇత్యాదిగా నెన్నియో సాధనంబులగొని వ్యాపారంబు లొనర్చి ధన ధాన్యైశ్వర్యంబు లార్జించి వాణిజ్య గోరక్షణం బాదిగా స్వవృత్తుల నిర్వర్తించి యనర్ఘరత్న భూషణాంబర గంధ మాల్యానులేపనంబుల నలంకృతులై భోగ సుఖానుభవంబుల దీపించి కోటీశ్వర నామంబులచే దానధర్మా చరణులని యెవరికతంబున బెంపొందు చున్నారో వారుకదా బ్రాహ్మణులు.

రెడ్డి కులజులు భూములు దున్నింప పైరు లెక్కింప పాతరలునింప జీవకోటుల క్షుదార్తినుపనయింప రెడ్డి సమాఖ్యలం దీపింప దాన ధర్మంబు లాచరింప నభివృద్ధి వహింపవలయు బండి, నాగలి, గొర్రు, గుంటక, మొదలుగా గల వ్యవసాయ పనిముట్లను నిర్మించి యిచ్చుటద్వారా ఫల సాయాభివృద్ధికి ముఖ్య కారకులెవరో వారుకదా బ్రాహ్మణులు.

సర్వజనుల మాన సంరక్షణార్థంబునకు శుభా శుభ కార్యములకు వలయు వస్త్ర నిర్మాతకులగు సాలె, జాండ్ర, తొగట మొదలగు నేతగాండ్రకు వలయు దోనె, పలక, నూల్తె. రాట్నము, లాక మున్నగు పలువిధములైన పనిముట్లు నిర్మించి యిచ్చిన వారెవరో వారుకదా బ్రాహ్మణులు.

క్షురకర్మ నాచరించి ఎల్లరకు పారిశుధ్యం బొనర్చుటయే గాక పితృ కార్యములందు నిర్వర్తించ వలసిన క్షురకర్మకు వలయు కత్తి, కత్తెర, తండసము, మొదంగు క్షురకర్మ సాధనంబులును, ఉపనయన, వివాహ, దేవోత్సవ సమయములందు మంగళ వాయిద్యంబులు వాయింప బూరుగ, సన్నాయి, బ్యాండు, డోలు, తాళము మున్నగు వాయిద్యపు పనిముట్లు నిర్మించి యిచ్చిన వారెవరో వారేకదా బ్రాహ్మణులు.

వేశ్యలకు నాడ, పాడ, గజ్జె, వీణా, మృదంగ తాళంబుల రచించి యిచ్చి ప్రజల గానామృతా స్వాదనంబున పదునాల్గు లోకంబుల యందును ఆనంద రసాంబుధి నోలలాడింపజేసిన మహానుభావు లెవరో వారుకదా బ్రాహ్మణులు.

కాశీ, గయ, ప్రయాగ, శ్రీశైల, అహోబిల, వెంకటాచల, కాంచి, కాళహస్తి, శ్రీరంగాది పుణ్య స్థలంబులయందు శివ, కేశవ, రామ, నృసింహాదిసురల గనక, రజిత, తామ్ర, దారు, శిలాదులచే సృజించి ప్రతిష్ఠించి భక్తియుక్తులైన ప్రజలకు నైహికాముష్మిక సుఖావాప్తియు, తదాశ్రితులగు నంబి, తంబలనర్చక, గణకాది సమూహమునకు, నిత్య జీవనోపాధి ప్రాప్తియు నేనుకృతవంతు లొనరించు చున్నారో వారేకదా బ్రాహ్మణులు.

ప్రభువను రిజష్ట్రారు, వధూ వరులను రైతులకు అన్యోన్య క్షేత్ర ప్రేమానుభవ స్వాతంత్ర్యమును అంగీకారమను ఉభయ పెద్దల చేవ్రాలతోటి దస్తావేజును రిజిష్టరుచేసి యివ్వ, వివాహ మను జమాబందియందు మంగళసూత్రంబను పట్టాను సృష్టించి యిచ్చిన ప్రభువను పరబ్రహ్మ స్వరూపులెవరో, వారు కదా బ్రాహ్మణులు.

దేవ, దానవ. మానవాది జంతుజాలంబులన్నియు జగదాది నుండి స్వకృత, సుకృత, దుష్కృత కార్యంబులకు సుఖ కష్ట ఫలంబులకు నెవరి సత్కృతు లాధారంబులుగా ననుభవనీయ మై యున్నవో అట్టి నిర్మాణకులే గదా బ్రాహ్మణులు.

యోగులకు దండ కమండలాదులు, రోగుల కౌషధాదులు, భోగులకు శయ్యాసనాదులు నెవరిచే నుత్పన్నములగు చున్నవో, తిలఘాతకులకు గానుగ మొదలగు సాధనమ్ములును, నెవరిచే లభ్యంబు లగుచున్నవో, కుంభకారక, రజకాదులకు కులాల చక్రము, ఇస్త్రీపెట్టె మొదలగు సాధనంబుల నిర్మాణ కొరకు లెవరో వారేకదా బ్రాహ్మణులు.

ప్రపంచము నందన్ని జాతుల ప్రజలకు నుదర పోషణార్థ మై కల్పించిన వృత్తులకు సాధనంబుల నిర్మించి యిచ్చిన వారెవరో వారుకదా బ్రాహ్మణులు.

ధీరునకు, వీరునకు, చోరునకు, జారునకు, గృహ విచారునకు, చారునకు, లోక సంచారునకు, సదాచారునకు, సుందరాకారునకు, పిచ్చుగుంటి, జోగి, బైరాగి, జంగమ, బుడబుక్కల, దాసరి, ఆటదాసరి, చెంచు, యానాది మొదలగు నటవిచరులకు, మాల, మాదిగెలకు, తోటి, తలారికి, పేద, సాద, ఇరుగు పొరుగు, సర్వజనులకు ఉండ ఇల్లు, పండ కుండ, దిన కంచము, పండ మంచము, దంచ రోలు, రోకలి, విసరతిరగలి, చేయుచేట, త్రాగ చెంబు, వడక రాట్నము మొదలగు యుపకరణంబులకు యెవరి కృత్యంబులు, ఆధారంబులో వారేకదా బ్రాహ్మణులు.

ఎవరి కృత్యంబులకు పరస్పరంబులు వినాయ న్య కృత్యంబులు సహాయ కృత్యంబులుగావో, ఎవరి బాహుశాఖలు లోకోపరార్థంబు వృక్షశాఖలున్ బోలెకాయలుగాచినవో, యెవరి మేనులు జగద్ధితా చరణంబున దుదకు జలదంబుల భంగి వెల వెలబారి కార్యంబుల వహించు చున్నవో అట్టి వారు కదా బ్రాహ్మణులు.

హిమ, శీత, వాతా, తపహిండబునకు సహించి పంచాగ్నుల మధ్యంబున దపసులంబోలె పరితపించి, కష్టించి లోకరక్షణం బొనర్చుచున్న వారెవరో మింటికి జుక్కలంటించిన వారెవరో, మింటంకి మంటికి సూత్రమిడు వారెవరో, జగన్నాటకమునకు సూత్రధారు లెవరో-అగ్ని స్తంభన, జల స్తంభన, వాయు స్తంభన, వాక్స్తంభన, ఇంద్రజాల, మహేంద్రజాలాది చతుష్షష్టి విద్యల కాధారభూతు లెవరో, వినుకెంపునకు నునుకెంపు వన్నె సాన కెక్కించి వక్రత చక్కదిద్దిన వారెవరో వారు కదా బ్రాహ్మణులు.

మంత్ర, యంత్ర, తంత్ర మహిమల కాధారభూతు లెవరు? మణి, మంత్ర, తంత్రౌషధ సిద్ధులకు, నష్టాంగయోగ సమాధులకు, అణిమాద్యష్ట సిద్ధులకు, వేద వేదాంగ పారాయణములకు, పాఠ్య, పాఠ, పఠనములకు. దేవతార్చన విధానములకు దేవ్యోపాసనలకు ఎవరి సేతలు జననీజనక ప్రాయంబులో వారేకదా బ్రాహ్మణులు.

సముద్ర మథనంబునకు కొండను కవ్వముగా, చిలువను (వాసుకుని) త్రాడుగా రచించిన వారెవరు, రామునకు రావణ వధార్థమునకు లంక కరుగ కడలికి సేతువుగట్టిన వారెవరు ?

విష్ణు దేవుని దశావతారములకు ఎవరిసేత లాధారంబులు, హరి, హర, హిరణ్యగర్భం, బ్రాగ్ని, యమ, నైరుతి, వరుణ, వాయు, కుభేర, యీశాన్యాది ముప్పదిమూడు కోట్ల దేవతలకు, దైత్య దానవాది అరువదియారు కోట్ల పూర్వ దేవతలకు, వాలి, సుగ్రీవ, నల, నీల, జాంబవంత హనుమదాది కపివీరులు పుట్ట, గిట్ట, నెవరు కారణ కర్తలు, వారికి నిలువనీడలు గల్పించిన దెవరు ? వారలకు శంఖ, చక్ర, శూల, మాల, దండ, వజ్ర, శక్త్యాది నానా యుధ నికురంబుల దుష్టనిగ్రహ శిష్టపరి పాలనంబునకు నికర మున గనికరమ్ములార నిర్మించి యిచ్చిన వారెవరు? అట్టి వారు కదా బ్రాహ్మణులు. వారే త్రిభువన నిర్మితోద్ధారకులు, ఫేషిణీ హనుమధ్వజ బిరుదాంకితులు, వారే మేఘవాహనులు, వారే విభూది రుద్రాక్ష మాలికాధారులు, వేద వేదాంగ నిర్మాతలు, వారే విశ్వకర్మ, విశ్వబ్రాహ్మణ, శిల్పిబ్రాహ్మణ, పాంచాలబ్రాహ్మణ, పౌరుషేయబ్రాహ్మణ, రథకారబ్రాహ్మణ, దేవబ్రాహ్మణ, అర్క శాలిబ్రాహ్మణ, జాంగిడబ్రాహ్మణ మొదలగు దశవిధ బ్రాహ్మణు లనియు, మరియు ఆచార్య, దైవజ్ఞ, నారాశంస, స్థపతులనియు, మను, మయ, త్వష్ట, శిల్పి, దైవజ్ఞ బ్రాహ్మణులనియు, పిలువ బడుచున్నారు. అట్టి వారి యెడ భక్తి విశ్వాసంబు లుదయింపజేసి విరాట్పురుషుండు జగంబుల రక్షించుగాక. చాతుర్వర్ణ మయా స్రష్టం గుణకర్మ విభాగశః॥ అను గీతావాక్యము నందలి అర్థాన్ని కరతలా మలకముగ గన్పట్టు నీ సత్యాన్ని అందరు గుర్తించి విశ్వ బ్రాహ్మణుల యెడ బేధ భావంబుల వదులుదురు గాక. ప్రజ లందరు సహకార భావమున ప్రవర్తింతురు గాక.

12)

విశ్వకర్మ వలన విశ్వంబు కలిగెను।
విశ్వకర్మ వలన వృద్ధి బొందె।
విశ్వకర్మ వలన విలయంబు గాంచును।
విశ్వకర్మ కన్న వేల్పు గలడె.

సర్వేజనా స్సుఖినోభవంతు.

సత్యం. సత్యం. సత్యం.

స మా ప్తి.



# విశ్వబ్రాహ్మణుల కనుకూలముగ ప్రభుత్వపు తీర్మానములు.

విశ్వకర్మబ్రాహ్మణ వంశాగమము నుండి

## 1. చిత్తూరు జిల్లా తీర్పు

క్రీ॥ శ॥ 1814 వ సంవత్సరము పండితమార్గ సహాయాచార్యులు మొదలగు తోమ్మండుగ్గురు వాదులు. పంచాంగం గండయ్య మున్నగు నార్వురు ప్రతివాదులు, ఈ యుభయులకు విస్తారముగ వివాదము జరిగి తీర్మానము కాబడిన తేది వివరం.

పిర్యాదు నెం. 254/ది 20—7—1817 రు స్వకుల పౌరోహిత్యమునకు హక్కును గూర్చినదావా. వాదులు వేదములు మున్నగు గ్రంథముల ప్రమాణము వలన శ్రేష్ఠమైన బ్రాహ్మణులైయున్నారు. కనుక స్వకుల పౌరోహిత్యమును గూర్చి యభ్యంతరమేమి యుండదు. అని వాదుల కనుకూలముగ తీర్మానింపబడినది. ప్రతివాదులు అపీలు చేసిరి నెం. 205/ది 15-12-1818 రు కోర్టు వారు మొదటి తీర్మానమునే స్థిరపరచిరి.

## 2. చెన్నపట్టణము హైకోర్టు క్రిమినల్ రూలింగ్.

1885 సంవత్సరం 78 వ నెంబరు క్యాలెండరు 152 పుట చూడుము. చెన్నపట్టణము శ్రీ మహారాణిగారి న్యాయస్థానమునందు 1885 సం॥ నెం. 421—422 ర్లు.

విశ్వబ్రాహ్మణులు ఏ పవిత్రమైన హిందూ దేవాలయ గర్భములోని కైనను వెళ్ళుటకు, పూజించుటకు, రుద్రాభిషేకము చేయుటకు హక్కు కలదు.

320

# 3. అసిస్టెంటు మేజిస్ట్రేటు కోర్టు నందిచ్చిన తీర్పు.

మచిలీ పట్టణము (కృష్ణా జిల్లా) 29 మే 1894 సం॥ పు కేసు నెం. 8 రు—శివకోటి వీరభద్రుడు అను విశ్వబ్రాహ్మణుడు మహాశివరాత్రి దినమున కాశీ విశ్వేశ్వర దేవాలయమున ప్రవేశించి లింగాభిషేకము చేయుటచే లింగము అపవిత్రము కాబడినదని పిర్యాదు తేబడుటచే నది క్రిమినల్ ప్రొసీజరు కోడ్ 258 వ శక్షను ప్రకారము కొట్టివేయ బడినది.

# 4. కృష్ణ జిల్లా, జిల్లా మేజిస్ట్రేటుచే నియ్యబడిన తీర్పు.

విశ్వబ్రాహ్మణులను "అభిషేకము" చేయనియ్య వచ్చును. ఈ నమూనా యే కృష్ణా జిల్లా—జిల్లా మేజిస్ట్రేటుచే 1894 సం॥ జూలై 6 వ తారీఖున దృఢపరుప బడినది.

# 5. గుంటూరు అడిషనల్ డిస్ట్రిక్టు మునసబు కోర్టులో

శనివారం, 1912 సం॥ మార్చి 30

అసలు దావా నెం. 26 రు 1911 సం॥

ప్రతి వాదులగు విశ్వబ్రాహ్మణులు దాఖలుచేసిన గార్గే యాగమము ననుసరించి విగ్రహము చేయుట మొదలు ప్రతిష్టాంతము వఱకు ప్రతివాదుల కధికారముగలిగి యుండుటచేతను,

ఏ దేవునియొక్క దేవాలయమును వారు ప్రతిష్ఠటచే నపవిచేయు త్రము కాకపోవుట చేతను, హిందువు లందరితరుపున నొక్కడే స్వంతముగా దావావేసి ఖర్చులడుగుట చేతను, విశ్వబ్రాహ్మణులు ప్రతిష్ఠించి నందున నపవిత్రత కల్గినదని రుజువు పఱచక పోవుట చేతను వారికి వ్యతిరేకముగా దీర్మానించి ఖర్చులతో త్రోసివేయ బడినది.

## 6. వివిధములైన న్యాయస్థానములందు ఇయ్యబడిన తీర్పులు.

1. 1840 క్రీ॥ వె॥ నందారు మద్రాసు హైకోర్టు తీర్పు"
2. 1840 క్రీ॥ వె॥ సేలం కోర్టు నెం. 1862"
3. 1856 క్రీ॥ వె॥ తిరుచునాపల్లి కోర్టు"
4. 1857 నెం. 141 సేలం జిల్లా అదాలతు కోర్టు"
5. 1861 క్రీ॥ వె॥ నందారు మద్రాసు హైకోర్టు తీర్పు"
6. 1861 క్రీ॥ వె॥ డిశంబర్ 2 తారీఖున సేలం కోర్టు"
7. 1866 సి సి.నెం. 583 గుంటూరు డిస్ట్రిక్టు మున్సిపుకోర్టు"
8. 1866 నవంబర్ 12 వ తేది కృష్ణా జిల్లా"
9. 1866 సి సి. నెం. 220 బెజవాడ డిస్ట్రిక్టు మునసబు"
10. 1866 క్రీ॥ వె॥ నవంబర్ 30 వ తేది నెం. 1933 ప్రభుత్వపు ప్రధాన కార్యదర్శికి పంపిన తీర్పు"
11. 1869 క్రీ॥ వె॥ డిశంబర్ 13 తేది నెం. 1935 కృష్ణా జిల్లా మేజిస్ట్రేటుకు ఇన్‌స్పెక్టరు జనరల్ పంపిన నమూనా (Order)
12. 1881 క్రీ॥ వె॥ చిత్రల్‌దుర్గలో మార్చి 8 వ తేది డిప్యూటి కమీషరనగు అబ్దుల్ కాదర్ గారిచే బాలాజీ మృగాచార్య దరఖాస్తు మీద నిచ్చిన తీర్పు"
13. 1885 క్యాలెండరు కేసు నెం. 78 విశాఖపట్నం డిస్ట్రిక్టు మేజిస్ట్రేటగు టర్నరు గారిచే నియ్యబడిన తీర్పు"

14. 1891 జి. యస్ నెం కోయంబత్తూరు జిల్లా సత్యమంగలం డిస్ట్రిక్టు మునసబుచే నియ్యబడిన తీర్పు"

15. 1891 సి. సి. నెం. 394 కొల్లెగాల్ ఫస్టుక్లాస్ అసిస్టంటు మేజస్ట్రేటు"

16. 1892 ఒ.యస్.నెం. 185 కోయంబత్తూరు జిల్లా తీర్పు"

17. 1892 ఒ. యస్. నెం. 48 కొల్లెగాల్ జిల్లా మునసబు తీర్పు"

18. 1893 డిశంబర్ 7 వ తేది అనరబుల్ జస్టిస్ డి. ముత్తుస్వామి అయ్యర్ కె. సి. ఐ. ఇ అనరబుల్ జస్టిస్‌జానత్‌గారి తీర్పు"

19. 1894 సి. సి. నెం 521 కృష్ణా జిల్లా డిస్ట్రిక్టు మేజిస్ట్రేటగు జే. యస్. అట్కిన్సన్‌గారి తిర్పు"

20. 1894 ఆక్టింగ్ డిస్ట్రిక్టు మేజిస్ట్రేటగు రొజన్‌గారి తీర్పు"

21. 1894 సం॥ జే యస్. అట్కిన్సన్‌గారు పోలీసునకు పంపిన సమాచారము"

22. 1894 సం॥ పోలీసుచే కృష్ణా డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుకు పంపిన రిపోర్టు"

23. 1894—95 సి. సి నెం. 17 చెన్నపట్నము తాలూకా మైసూరు జిల్లా సెకండుక్లాసు మేజస్ట్రేటు తీర్పు"

## విశ్వకర్మ వంశీయులగు జాంగిడ బ్రాహ్మణుల నిందించి నందుకు శిక్షింపబడుట.

1928 వ సం॥రం క్రిమినల్ కేసు నెం. 120/2 ఢిల్లీ ఫస్టుక్లాసు ఆనరరీ మేజిస్ట్రేటు అగు అర్. యస్. యల్. గోపాల దాసు బి ఎ. గారి తీర్పు.

పిర్యాది:—గంగాసాహెబ్ కుమారుడగు దీనదయాల్ శర్మ. కార్యదర్శి:—జాంగిడ బ్రాహ్మణ మహాసభ. ఢిల్లీ.

ముద్దాయి:—హనుమాన్ దత్త జోషి, "మార్వారి బ్రాహ్మణ" సంపాదకుడు, ప్రకాశకుడు, కలకత్తా.

ఓంశ్రీం

రిజి 62/బికె4/11

# శ్రీ ఆదిశంకరాచార్య వేద ధర్మ పీఠమ్

కుంట్లూరు(గ్రా), హయత్‌నగర్(మం), రంగారెడ్డి(జిల్లా)-501505

సెల్:9440932455,95020541

శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే। జగతఃపితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ॥



ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే అను వచనాను సారంగా సాక్షాత్తుపరమశివుడేభారతావనిలో శ్రీ ఆదిశంకరులుగా విశ్వకర్మవంశంలో ఆవిర్భవించికాశ్మీరు నుండి కన్యాకుమారివరకు తమ పాదస్పర్శచే పునీతంచేసి అద్వైత మతమునుస్థాపించి సనాతనహైందవ ధర్మమును పునరుజ్జీవంచేసిఎన్నోసాహిత్యగ్రంథములద్వారా తమవాణిని వినిపించి జగత్ ఖ్యాతి గాంచి జగద్గురువులైనారు సమస్త మానవాళికి మోక్షమార్గాన్ని ఉపదేశించి ధర్మపథంలో భారతావని ఆదర్శంగాఉండేందుకు అనుగ్రహాన్ని ప్రసాదించిన శ్రీశ్రీశ్రీఆదిశంకరాచార్యుల వారి పేరున ఈ సంస్థస్థాపించబడినది.

అర్హతలు : 7వ తరగతి నుండి పదవ తరగతి వరకు చదివిన విశ్వబ్రాహ్మణ విద్యార్థులను ప్రవేశ పరీక్ష నిర్వహించి ఉత్తీర్ణులైన వారిని సాధారణ రుసుముతో చేర్పించుకొని 2సం॥లు ఉచిత విద్య,వసతి, భోజన వస్త్రములు పుస్తకములు కల్పించబడుచున్నవి. ఇవ్వబడుచున్నది.

<u>ఈ పీఠమునందు బోధించు అంశములవివరములు</u>

1. స్మార్తపాఠము:-విద్యార్థికి జాతకర్మ, ఉపనయన,వివాహాది దేవతాప్రతిష్ఠలకుఅవసరమగు మంత్రపాఠముక్రియా సహితముగాను, దేవాదాయధర్మాదాయశాఖ వారు నిర్వహించు ప్రవేశ,వర,ప్రవర పరీక్షలకు అన్ని ఆగములకు శిక్షణ ఇవ్వబడును.

2.జ్యోతిషం,వాస్తు:-జననకాల ఆధారంగా జాతకములనువ్రాసి ఫలితములు వివరించి దోషనివారణోపాయములుచెప్పుటయందు శిక్షణ గృహ,దేవాలయ,కర్మాగారములకు అవసరమగు వాస్తు శాస్త్రములందు శిక్షణద్వారా శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం వారు నిర్వహించే వివిధ వాస్తు జ్యోతిష పరీక్షలకు శిక్షణ ఇవ్వబడును.

3.సంస్కృత,తెలుగు సాహిత్యములు:-ఆసక్తిగల విద్యార్థులకుఅవసరమగు సంస్కృత సాహిత్యపరిచయంచేసి దూరవిద్యద్వారా ఇంటర్మీడియట్,డిగ్రీ కోర్సులలో చేర్పించి వానియందు శిక్షణఇవ్వబడును.

4.కంప్యూటర్‌పరిజ్ఞానం: MS word, MS Excel, Power point, DTPలయందు శిక్షణఇవ్వబడును.

**వివరములకు వ్యవస్థాపక చైర్మన్ ప్రధానాచార్యులు**

**బ్రహ్మ శ్రీ పడకండ్ల వేంకటాచార్య గురుకుల్ (వేదాగమ పండితులు)**

**ఫోన్:9502054149,9440932455**